వసు—ఓయాచార్యోత్తమా! నిజముగా నీవలననొక కార్యముండియే మేము నీ యనుగ్రహము కోరివచ్చినాము.

గండ—మీరువచ్చినకార్యమేమో చెప్పుఁడు.

వసు—మాకిప్పుడీదేవాలయములో వివాహము కావలసియున్నది. మాకొరకుఁ బురోహితునిఁ దెచ్చుకొన్నాము.

గండ—ఇటువంటి పన్నుచువాండ్రను మాదేవాలయములో వివాహము చేసికోనియ్యఁగూడదు. మీరుతరువాత మాకేమయినను చిక్కులు తెచ్చిపెట్టుదురు. కాఁబట్టి యిక్కడవివాహమునకు నేనొప్పుకొను. నాకొకగొప్పయాక్షేపణయున్నది.

కామ—వసుకామా! ఈయాచార్యుని సమాధానపఱుచుటకు మంచిసాధన మేమయిననున్నదా?

వసు—తిరుగులేని దొడ్డసాధన మొకటియున్నది. దానినిమించినసాధనము మఱియొకటిలేదు. నీవిప్పుడు రెండువరహాలీతనిచేతిలోపెట్టితివా, దానితోసమస్తాక్షేపణలును నిముషములో పోవును.

కామ—ఓయాచార్యోత్తమా! మాయందనుగ్రహింపుము. (అనిచేతిలోసొమ్ము పెట్టుచున్నాఁడు.)

గండ—ఈవిషయములో నేనుధనమంగీకరింపవలసిన పనికాదు. కాని మీరు నాయోగ్యతనుకనిపెట్టి భక్తిపూర్వకముగా దక్షిణయిచ్చినప్పుడు దానిని నేను స్వీకరింపక నిరాకరించినపక్షమున మీమనస్సులు చిన్నపోవునని గ్రహించుచున్నాను.

కామ—ఇఁకమనము లోపలికిపోదము రండు.

వసు—ఓనారాయణశర్మా! ఇంకజాగుచేయక నీవు మాసుఖసంతోషములకు కారణభూతుఁడవుకమ్ము.

నారా—మంచిది. ఈవివాహమువలన ముందొకవేళ మీలో నెవ్వరైనపశ్చాత్తాపపడవలసివచ్చెనుపక్షమున మీరప్పుడునన్ను నిందింపవలసినపనిలేదు సుండీ.

కామ—(తనలో) ఈహితబోధ పాపమీవసుకామునకుఁ దగియున్నది. (ప్రకాశముగా) ఓబ్రాహ్మణోత్తమా! నీపనినీవు జరిగింపుము. ఆపయి నేమిసంభవించినను నేను బద్ధుఁడనయి యుండెదను.

వసు—నేనంతకంటెను బద్ధుఁడనయి యుండెదను.

[అప్పుడు భానుమతి పరుగెత్తుకొనివచ్చి ప్రవేశించుచున్నది.]

భాను—ఓకామపాలా! విజయవర్మవసంతమంటపము వద్దకువచ్చి మనమెక్కడనున్నామని యక్కడివారినడుగుచున్నాఁడు.

వసు—ఎవరు? సుదర్శనవర్మ కాదు కు విజయవర్మా? అతఁడు నా పేరడుగ లేదుగద?

కామ—ప్రియురాలా! జడియఁబోకు. నేనాతని శాంతాత్మునిఁ జేసెదను.

వసు—అపని నీచేతకాదు. ఓకామపాలా! నీవు నామాటవిని పారిపో. ఆవిజయవర్మ దయాదాక్షిణ్యములులేని క్రూరకిరాతుఁడు. అతనివద్ద నల్లత్రాఁచువలె నిడుపయిన చేఁకత్తి యొక్కటియున్నది. ఈశ్వరసాక్షికముగా చెప్పుచున్నాను. అతఁడు నిశ్చయముగా దానితో నీగొంతుకకోయవలెనని వచ్చుచున్నాఁడు.

కామ—నాకాభయము లేదు.

వసు—భయములేకపోయినపక్షమున నీవుండుము. నేను పుత్రియొకపురోహితుని సంపాదించి యింకొకదేవాలయములో వివాహము చేయించుకొనెదను, ఈరెండు కాళ్ళలోను శక్తియున్నంతవరకు నిఁక నేనాతని కంటఁబడను. (అని పరుగెత్తి పోవుచున్నాఁడు.)

భాను—(మేలిముసుఁగు వేసికొనుచున్నది.)

[విజయవర్మ ప్రవేశించుచున్నాఁడు.]

విజ—కష్టపడి చిట్టచివరకు మిమ్మిక్కడ పట్టుకొన్నాను.

కామ—మంచిది. ఇప్పుడేమనెదవు?

విజ—ఓరిపరమనీచుఁడా! మిత్రద్రోహీ! వంచకుఁడా! నమ్మించిద్రోహము చేసిన పురుషుని నంక నింతనిర్భయముగా చూడఁగలుగుటకు నీకీధైర్య మెక్కడినుండి వచ్చినదిరా?

కామ—ఓయీ! నీవు దురాగ్రహగ్రస్తుఁడవయియున్నావు. నాప్రాణాధికురాలయిన ప్రియురాలిని నేనిప్పుడు వివాహము చేసికొనఁబోవుచున్నమాట సత్యమే. కాని యిల్లు బయలుదేఱిరమ్మని నేనామె నెంతమాత్రమును ప్రోత్సాహపఱుపలేదు. నీవలెనే నేనును మోసమన్న ద్వేషించువాఁడనే. దైవముతోడు! ఆమె తనపితృగృహము విడిచివచ్చినదని నేనామెను కన్నులారచూచువఱకును నాకు తెలియనే తెలియదు.

విజ—ఇదివట్టిపనికిమాలినసమాధానము. నీవీవిషయములో తప్పక మిత్రద్రోహము చేసినావు. ఆమె మొండిసాహసికత్వము చూచి యిట్టిద్రోహమేదో జరిగినదని మనసులో నేనీవఱకే యనుమానపడినాను. ఈసంగతియంతయును నీతార్పుకాఁడయిన యీపాషండుఁడు నాతో స్పష్టముగా చెప్పినాఁడు. ఇఁక నీవు చేసిన పనికి సాకులు వెదకిన ప్రయోజనము లేదు. ఈద్రోహము చేయసాహసించినావు గనుక నీవిప్పుడు నా కెదురువచ్చి, చేసినపని చేసితివని దృఢముగా చెప్పుటకు నీకు ధైర్యమున్నదని కనఁబఱుపుము,

భాను—(జనాంతికముగా) ఓకామపాలా! నేనిప్పుడీతని భ్రమను కనిపెట్టినాను.

ఇతనిని నాకొప్పగించుము. నేనితని భ్రమనివారణము చేసెదను.

నారా—అయ్యా! ఆశపడివచ్చిన కాముకులయొక్క పొందు చెడఁగొట్టుట నీకు ధర్మముకాదు.

విజ—ఓపురోహితా! ఇందులోనీ వేమియు సంబంధముకలుఁగ జేసికోఁకూడదు. ఇతఁడు పాణిగ్రహణము చేసికోఁదలఁచుకొన్న యీసుందరి నాసొత్తు.

నారా—అట్లయినపక్షమున నేనిఁక వివాహము చేయించను. ఓసుందరీ! ఇతనిని చేపట్టెదనని నీ వెప్పుడయిన వాగ్దానము చేసియున్నావా?

భాను—(తలయూఁచుచున్నది.)

విజ—ఓసుదంతా! నీమౌనము నాకు సంతోషమగుచున్నది. నీజిహ్వ యసత్యము పలుకుచుండఁగా వినుటకు నాకిష్టములేదు. నిన్ను నేను దూషింపలేదని స్మరించుకొనుటయే నీకుతగినశిక్ష.

[ముసుఁగు వేసికొని సుదంత ప్రవేశించుచున్నది.]

సుదం—ఏమియీహాస్యమిక్కడ!

విజ—కామపాలా! దేవాలయమగుటచేత నీవిక్కడ నిరపాయుఁడవయినావు. ఇఁకముందు మఱియెక్కడను కలిసికోకపోముళే. (అని పోఁబోవుచున్నాఁడు).

సుదం—(అతనిచేయి పట్టుకొనుచున్నది.)

భాను—(రెండవచేయిపట్టుకొని) కొంచెము సేపునీకోపముచల్లార్చుకొనియొక్కసారి కరుణించి యీవంక చూడుము.

సుదం—నిన్ను నిలిపి నీకోపశాంతిచేయుటకయి నేనును తోడుపడవలెను.

భాను—నీకత్యంత ప్రేమాస్పదురాలనయిన నన్నానవాలుపట్టలేవా!

సుంద—నాప్రియుఁడవయియుండియు నీవీప్రకారముగా నన్ను విడిచి పాఱిపోవచ్చునా? (ఇద్దఱును ముసుఁగులు తీసివేయుచున్నారు.)

విజ—ఇదియేమి? నాచెల్లెలా? సుదంతకూడనా? నాకిక్కడ చిత్తవిభ్రాంతి కలుగుచున్నది.

భాను—ఓప్రియసహోదరా! నేను నీచెల్లెలనే.

నారా—ఏమియీధర్మవిరుద్ధము! ఇతఁడు తనతోఁడఁబుట్టినదానినే వివాహముకూడఁ దలఁచుకొన్నాఁడా?

భాను—ఎంతసిగ్గుచేటు! నీవు నీసోదరినే తెలిసికోలేక పోయినావు!

సుదం—నీప్రియురాలినే తప్పిమివేయుట యంతకంటెను—

భాను—అనుమానముచేత జనులెంత కన్నుగాననివారయ్యెదరో నీకు తెలియదా?

సుదం—ఇఁక ముందును నీవిలాగుననే యనుమానపడుచుండెదవా?

విజ—ఎప్పుడును పడను—ఓసోదరీ! నీవు క్షమింతువని నేనెఱుఁగుదును—ఒకసంగతా! నిన్ను నేనెట్లు క్షమింప వేఁడుకోఁగలనో—

సుదం—అక్కఱలేదు. "నన్నాయాసపెట్టఁబోకు" మని యింతకుమునుపే నన్ను కసరినావు. "అయ్యో! నీకిప్పుడుకావలసిన దెవరు?" అని నేనడిగినప్పుడు. "నీవు కాదునీవుకాదు" అనినాకు తెలియఁజెప్పినావు. ఓకామాంధా! ఈవిషయమయి యిఁక ముందెప్పుడును శంకపడనని ప్రమాణము చేసెదుపక్షమున, నిన్ను మన్నించెదను.

విజ—లోకములోని సర్వదేవతల—

సుదం—చాలును. ఇప్పుడెంత దృఢముగా ప్రమాణము చేయనారంభించినావో ముందు నీవంతదృఢముగానే చేసినబాసను చెల్లింపవలెను సుమీ. (అని చేయిపట్టుకొనుచున్నది.)

భాను—అన్నయ్యా! నీవు క్షమింపుమని వేఁడుకోవలసినవారిక్కడ మఱొక్కరున్నారు.

విజ—ఓకామపాలా! ఈసంగతి తలఁచుకొనుటకే నాకుసిగ్గగుచున్నది. నన్ను—

కామ—విజయవర్మా! నీవు క్షమార్పణము చేయవలసినపనిలేదు. నేనును కాముకుఁడనేగనుక కాముకులకోపమును గణన చేయరాదన్నమాట యెఱుఁగనివాఁడను గాను. మనమీబ్రాహ్మణునితో లోపలికిఁబోయి ముందుగామనపెండ్లితంతుజరపించుకొందమురమ్ము. ఈభ్రమకు కారణము తరువాత నీకు సావకాశముగాఁ జెప్పెదను.

ఉ. ప్రేమనటించుచుం బ్రియులు ప్రేలుప్రలాపము లాలకించి లోఁ
గాముఁడు నవ్వుచుండు; మదిఁగాముకులెవ్వరు నిష్కళంకప
ప్రేమవహింతురో యెఱిఁగి వేగఫలంబిడు; ప్రేమచేతనే
తాము వివాహమాడి తగుధన్యులకే యిడు దీర్ఘసౌఖ్యముల్.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

---

౭. రంగము—సుదర్శనవర్మ గృహములోని సభామంటపము.

---

[సుదర్శనవర్మయు, దామోదరుఁడును, సేవకులును, ప్రవేశించుచున్నారు.]

సుద—ఈరాత్రి మనయింట నేమియు లోపముండఁగూడదు. మన పరిచారకులందఱును నవ్యభోగములు గలవారయి మహోల్లాసముగా నుండవలెను. ఈరాత్రి విందుకువచ్చువారి నందఱినిమీరాదరించి సమస్తోపచారములుజరపవలెను. విన్నారా? పొండి.

సేవకులు—చిత్తము. (నిష్క్రమించుచున్నారు.)

సుద—దామోదరా! నీయజమానుఁ డెక్కడనున్నాఁడు? అతఁడుసాయంకాల భోజనమున కింటికిరాఁడా యేమి?

దామో—నిశ్చయముగా రానట్టే యున్నాఁడు. అతనికి చిత్తచాంచల్యముకలిగిన దేమోయని నాకు సందేహముగానున్నది. అతఁడు నన్నింతకుముందు చెదరించి యింటికి సాగనంపినాఁడు.

సుద—అతఁడేదో వన్నెలాడి వెరనుబడి తిరుగుచున్నాఁడుకాఁబోలును! పట్టి పడుచునిర్భాగ్యుఁడు. వాఁడు రాకపోయినను మనవేడుక కొంఁతపడఁగూడదు. నీవుపోయి లోపల కావలసిన సన్నాహము చేయించుము.

దామో—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

సేవ—(ప్రవేశించి) అయ్యా! వసుకాముఁడు వచ్చియున్నాఁడు.

సుద—లోపలికి రమ్మను.

సేవ—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

[వసుకాముఁడు ప్రవేశించుచున్నాఁడు.]

సుద—ఓక్రొత్తపెండ్లికొడుకా! అల్లుఁడా! మిమ్ముక్షమించినాను. నాయాశీర్వాదము లొందుఁడు నాప్రియపుత్రికయెక్కడ! ఏదీభానుమతి!

వసు—ఆమె వాకిటలోనున్నది. మీయాశీర్వాదము పొందవలెనని యెంతో కుతూహల పడుచున్నదికాని లోపలికి వచ్చుటకుమాత్రము జంకుచున్నది.

సుద—నీవు పరుగెత్తుకొనిపోయి దానిని లోపలికితీసికొనిరా.

వసు—(నిష్క్రమించుచున్నాఁడు.)

సుద—పాపము! నన్నుచూచుటకు మొగముచెల్లక భయపడుచున్నది కాఁబోలును! దానిముద్దు మొగము చూడవలెనని నాకెంతో తొందరగానున్నది.

వసు—(తెరలో) నాముద్దుగుమ్మా! రమ్ము. నావడఁకుదేవతా! రమ్ము.

[వసుకాముఁడును, రాగమంజరియు ప్రవేశించుచున్నారు.]

సుద—(ఎదుర్కొనుటకయి పరుగెత్తుచున్నాఁడు.)

రాగ—(సుదర్శనవర్మ కాళ్ళమీఁద పడుచున్నది.)

సుద—నాచిన్నతల్లీ! నాకొకసారి నీకౌఁగిలియిమ్ము. (అని చేతులుచాఁచి యులికిపడి వెనుకకువచ్చి) ఈరాక్షసి నాయింటి కేలవచ్చినది?

సుద—ఓసుదర్శనవర్మా! నీవారిమెను క్షమించెదమని యిప్పుడేకదానమ్మికయిచ్చితివి? సిగ్గువేల నాప్రియకుమారితెట్లు కుంగిపోయినదో చూడుఁడు.

సుద—నిశ్చయముగా దొరికినది. ఇది యువతిరాగమంజరి. కామపాలుఁ డెక్కడ? భానుమతి యెక్కడ?

వసు—ఇదిగో మీకన్నులయెదుర నేయున్నది.—ఓ ప్రాణేశ్వరీ! సిగ్గుపడఁబోకు.

సుద—ప్రాణేశ్వరీ? నీప్రాణముదీయుటకు దొడ్డప్రాణేశ్వరి దొరకినది. అయ్యో! నీవీరాగమంజరినే వివాహము చేసికోలేదుగద?

రాగ—(సాష్టాంగపడి) ఓ బాబయ్యా! నన్ను మీబిడ్డనుగా భావించుకొందురని ప్రార్థించెదను.

సుద—బాబయ్యా? బాబయ్యా? నీయద్భుతరూపమునకంటెను మొండితనము హెచ్చుగానున్నట్టున్నదే.

వసు—నామనోహారిణీ! పాదములమీఁదనుండి లేచినీమృదుబాహులతలు నీతని కంఠమునందు తగిలించి నీవీతని బిడ్డవని యొప్పింపుము.

రాగ—అయ్యా! నన్ను క్షమింపుము. (అని కౌఁగిలించుకొనుచున్నది.)

సుద—ఇక్కడ నరహత్య జరుగుచున్నది ఓ సేవకులారా! మీయజమానుని రక్షింపుఁడు. రక్షింపుఁడు.

[సేవకులు ప్రవేశించుచున్నారు.]

సేవ—అయ్యా! ఇప్పుడుపద్రవమేమి సంభవించినది?

సుద—ఈపాడు పాపండుఁడు నాగొంతుకకోసుకొనుటకయి యీముసలితొత్తును తెచ్చి నాకొప్పగించినాఁడు.

వసు—హా! దైవమా! ఈమె యీతనికన్నకూఁతురు. ఈతఁడు కఠినచిత్తుఁడయి యీమెను క్షమింపకున్నాఁడు.

[కామపాలుఁడు, భానుమతి, ప్రవేశించి సుదర్శనవర్మ పాదములకు మ్రొక్కుచున్నారు]

సుద—నాదేహమువణఁకుచున్నది. కంపమెత్తుచున్నది. నామందీవేషములెక్కడివి? ఇక్కడకు నిన్నెవరు రమన్నారు?

కామ—ఈమెభర్తను నేను.

వసు—ఈమాటసత్యమే. ఈతఁడే యీమెభర్తయని నేను నిశ్చయముగా చెప్పఁగలను. వీరినిద్దఱిని దేవాలయములో పురోహితునివద్ద నేనే యొప్పగించినాను. కన్యాదాతనుకూడ నేనే కావలెనుకొన్నాను.

సుద—నీవేయొప్పగించినావా?

వసు—అవును. నేనే యొప్పగించినాను. ఇతఁడు నాకొప్పుఁడయిన కావ

పోలేదు; ఇతనికాళ్లకు బంధమతగిలించెదనని నేనప్పుడు మీతో మనవిచేసినది యీ చిన్నదాని విషయమే.

సుద—నీకేమి మతిపోయినదా? లేక త్రాగి దేహము తెలియకున్నావా? ఇది నాకూతురు.

వసు—కాదుకాదు. అపుత్రిభ్రమయు కల్లుమత్తునుగూడ మీకేకలిగినవి. ఇదిగో మీకొమార్తె యీమె.

సుద—ఓయన్యాయధనుశాలా! ఇందులో వాస్తవమేమో జరిగినదంతయు నీవు చెప్పు.

రాగ—ఓసుదర్శనవర్మా! సర్వమును మారూపములే మీకిప్పుడు చెప్పుచున్నను, నేనును విన్నపము చేసెదను. మీరు మీకొమార్తెను నన్నును తిన్నగా చూడుడు.

వసు—ఏమిపాపము! నాపాడుచెవులు లేమాటలనే వినుచున్నవా?

రాగ—నేటియుదయమున మీరు మీకోపవేగములో కొంచెము పొరపాటు చేసినారు. మీరు మీకొమార్తె నావలెనతోలివేసి మీకేవకురాలినిగదిలోపెట్టి తాళము వేసినారు. దీనిసత్యమిది?

వసు—హాదైవమా!హాదైవమా!ఈబుద్ధిమంతుడు ముసలిరాగమంజరికిబదులుగా తనకొమార్తెనే యింటినుండి పంపివేసినాడు!

సుద—హాదైవమా! హాదైవమా! ఈబుద్ధిమంతుడు నాకొమార్తెకు బదులుగా ముసలి రాగమంజరినే వివాహముచేసికొన్నాడు!—ఇంకతక్కినపనియంతయు నెట్లు జరిగినది?

రాగ—నేను మీపుత్రికాప్రతినిధినై యామెస్థానమున గదిలో కూరుచుండి యిక్కడ నాసరసనున్న యీధీమంతున్నినేనుకు పాత్రురాలనయియాయనను భర్తనుగా దక్కించుకొనుభాగ్యమును పొందితిననితప్ప నేనుమరేమియు చెప్పవలసినదిలేదు.

వసు—భర్తనుగానా? ఓసిముసలిభూతమా! నేనింకను నీకు భర్తనుగానుండ దలచుకొన్నావా? ఇదియెట్టిమోసము! కేవలమాయ! హీనమైనవంచన! ఈపనిచేసినందుకు మీరందఱును తలలువంచుకోవలెను.

కామ—ఓవసుకామా! మాయ యని నీవుకూడతప్పించుచున్నావా!-ఓసుదర్శనవర్మా! నామాటవినుము. ఈజిత్తులమారి పాపంకుడు నీకొమార్తెకిచ్చెడి యరణముగ యీ పుష్పమునాని దానికిబదులు నీకొమార్తెను స్త్రీధనముగా తానుంచుక యేమియు నియ్యక నిన్ను మోసపుచ్చుటకయి కృషిచేసియీఫలమంతయు తానే తెచ్చుకొన్నాడు. ఇది యితని స్వయంకృతాపరాధము.

సుద—నన్ను మోసపుచ్చుటకా!

భాను—అందుకు సందేహ మేమి? ఈసంగతిమీరొందుట నే మేమిప్పుడే బుజావు చేయగలము.

సుద—ఓరిపాపాత్ముఁడా! ఇది నిజమయియేయుండును. కాకపోయినయెడల, రాగమంజరి ముఖమువంటి ముఖమునుచూచిన తప్పువాతఁగూడ నిరఁడింత సాహసము చేసియుండఁడు. ఓభూలోకబృహస్పతీ! నేను హృదయపూర్వకముగా నిన్నును నీ భార్యను సుఖవంతులగుఁడని యాశీర్వదించుచున్నాను.

భాను—కామవిషయములో మోసముచేయుటనిందార్హముకాదుకాదా? నీనీతి నీకేపనికివచ్చినది.

కామ—నీమంత్రశక్తి యిప్పుడు స్పష్టమయినది! నీకద్దనింద్రజాలమహేంద్ర జాలములున్నవి!

భాను—నీవు శంబరాదులను మించిన మోసగాఁడవు?

సుద—అవునవును. మేనత్తయితనికి చిన్నప్పుడు బృహస్పతి యనిపేరు పెట్టినది.

వసు—లోకములోనున్న మాయలన్నియు మీయొద్దనేయున్నవి. ఇటు వంటి వంచనకు నేను లోఁబడుదు ననుకొన్నారా?

కామ—ఓవసుకామా నీకు నేనొకబుద్ధిచెప్పెదనువినుము. నీకు లభించినదానితో తృప్తిపొంది యూరకుండుము. లేకపోయినపక్షమున పరులను వంచింపఁబోయి మోసగాఁడే మోసపోయినాఁడని యొకతాళిచేసి లోకులందఱునునిన్ను చప్పటలుకొట్టి నవ్వెదరు సుమా.

వసు—నాకాపరిహాసములక్కరలేదు. ఈవంచననేనుసహింపలేను—ఓసుదర్శన శాస్త్రీ! దీనికంతకును నీవేకారకుఁడవు. నీవుగదిలోపెట్టి తాళము వేసినదానిని అతిరూపవతి యనియు వర్ణనచేసి, నాకల్లియంత ముదిముఖము కలదనియు కుబ్జవంటి కురూపిణి యనియు నేను చెప్పినప్పుడు నామాట పెడచెవినిబెట్టి కోపపడినావు.

రాగ—ఓరిజిత్తులమారినక్కా! నన్నేమన్నావు?

సుద—మేలు మేలు! మంచిపనిచేసినావు. రాగమంజరీ! ఆలాగునబుద్ధిచెప్పు

రాగ—ఓవడిసెకుఁగా! నీయందమునకు నీవు సౌందర్యము పేరుకూడ తలపెట్టుచున్నావా? పిల్లికన్నులును, చప్పిదౌడలును, దొప్పచెవులును, మిట్టనొసలును, పెట్టు గాని కొండ్రముచ్చువలెనున్న నీవుకూడ నన్నాక్షేపించవలెనా?

సుద—రాగమంజరీ! తగినట్లుచెప్పినావు?

రాగ—కళికట్టి వేనలో కొలువు కేసివచ్చిన తోడఁబుటినవాఁడొకడు

నాకక్కఁడనున్నాఁడన్న మాటమఱచిపోకు. నావిషయములో నీవన్యాయము చేసితివా—

వసు—నీవును నీతోఁడఁబుట్టినవాఁడును కట్టకట్టుకొని నిప్పులోపడుఁడి. మీ బాధ విఱుగడ చేసికొనుటకయి నేనిప్పుడు కాశికిలేచిపోయెదను.

రాగ—నీవెక్కడకుపోయినను నేను నీవెంటరాకవిడువను.

సుద—ఓరాగమంజరీ! నీదూదివంటిచేతులొక్కసారి యతనికిసోఁకనిమ్ము.—

[వసుకాముఁడును, రాగమంజరియు, నిష్క్రమించుచున్నారు.]

సుద—మంచిది. భానుమతీ! నిజముగా నీవీ భద్రప్రభువును వివాహము చేసికొన్నావా?

భాను—మీయాజ్ఞకు బద్ధురాలనయి రెండుగడియలక్రిందటనే యీతని చెట్టఁబట్టితిని.

సుద—నాయాజ్ఞకా?

కామ—అవును. ఇదిగో మీయంగీకారపత్రిక. ఇది మీస్వహస్తలిఖితము.

సుద—ఏమీ! నన్నుభ్రమపెట్టి, నాకొమార్తెను నీవపహరింపఁదలఁచుకొన్నావా? ఈయుపాయము చేతనే నీవు భానుమతి హరణమునుకూడ దక్కించుకొంటివా! అట్లయిన నిశ్చయముగా వసుకామునివలె నీవును దొంగవే.

కామ—ఓసుదర్శనవర్మా! నేనట్టివాఁడనుగాను. నీకొమార్తెను పాణిగ్రహణము చేసికొనుటలో నీయుత్తరమువలనిలాభము పొందినవాఁడనయినను, మోసము చేసియీ సొమ్మును పరిగ్రహించుట నేను హేయముగా నెంచెదను. ఇదిగో నీయుత్తరము! నీవుపుచ్చుకొమ్ము. (అని యుత్తరమిచ్చి) నీయరణమునకుమాఱుగా నీకొమార్తెకు నీదీవనలనిమ్ము. ఇందుకుమాఱుగా నాకున్న సొత్తంతయు నేనీమెకు స్త్రీధనముగా వ్రాసి యిచ్చెదను. నీవీమెను మహారాజునకిచ్చి వివాహము చేసినను, నీకతఁడింతకంటె నెక్కువేమియు చేయఁజాలఁడు.

సుద—నీవత్యద్భుతమయినవాఁడవుగా నున్నావే! నీవుతప్ప నీవలె నుదార కార్యమునుచేయువారు మఱియెవ్వరునులేరని నీకుగర్వమున్నదాయేమి?—ఓభానుమతీ! నేనెఱిఁగినంతవఱకు నీహరణమక్కఱలేదన్నవాఁడు నాకితఁడొక్కఁడు కనఁబడుచున్నాఁడు. ఈభరతఖండములోనివారిలోనెల్ల నీయరణమును పొందుటకితఁడే యర్హతముఁడని నాయభిప్రాయమగుట నీవునీప్రియుఁడయినయీగర్వితునిలోఁజెప్పు. ఇదిగో మిమ్ముద్దఱిని నేనిప్పుడాశీర్వదించుచున్నాను. అప్పిచటను నాదయినప్పుడుపట్టిన పట్టు నేనువిడుచువాఁడనేకాక, న్యాయవిషయములో నేనన్నుమాట యెప్పుడును తిరుగువాఁడనుకానని కూడ మీరు తెలిసికొఁగలరు.

[అప్పుడు విజయవర్మయు సుదంతయు ప్రవేశించుచున్నారు.]

సుద—ఇక్కడ శాకింశోకయద్భుత మగపడుచున్నది! ఓవిజయవర్మా! నీవు యోగిని నెవ్వతెనైన మఠమునుండి లేవఁదీసికొని రాలేదుకదా?

విజ—ఈమె పరుబట్టలో నేకాని మతియొందులోను యోగిని కాదు. దగ్గఱగా వచ్చిచూడుఁడు. ఈమె మాధవసేనుని కూఁతురయిన సుదంతయగుట మీకన్నులే తేట పఱుచును.

సుద—ఇదిమహాభాగ్యము! నీవెంతో తెలివిగల పడుచువాఁడవు. నిన్ను క్షమించితాను. ఓముద్దులకోడలా! నీవు చక్కనిచిన్నదానవు. నీముసలిమామగారి కొక్కసారి నీనవ్వుమొగము ముద్దిమ్ము.

సుద—అయ్యా! ఇఁకముందు మీరు మమ్మాదరించి కడుపులో పెట్టుకోవలెను

(అని చేయిముద్దిచ్చుచున్నది.)

సుద—తావళములు త్రిప్పుటచేత నీచేతులింకను గట్టుపడలేదే! నేనిప్పుడు సంతోషము పట్టఁజాలకున్నాను—ఓరి! దామోదరా! ఘటకా! దారకా! మనవీధి తలుపులు తీసి యుంచినారా? ఈవత్సరమున మాకుబిడ్డలవివాహములే గొప్పవేడుకలు. ఈరాత్రి యుత్సవము దివ్యముగా జరగవలెను. మన బంధువులును మిత్రులును వచ్చుచున్నారు. చిన్నపెద్దలందఱును కలిసియీరాత్రి యుల్లాసముగా గడపవలెను.

[లోపల సంగీతము పాడఁబడుచున్నది.]

మత్తకోకిల.

సుద—ఎల్లవారలు రంగువేడుక హెచ్చునిచ్చట హాయిగా
గొల్లగాఁగను పెండ్లిపాటలు కోరిపాడుచునవ్వుచున్
మెల్లఁగానిక ప్రొద్దుపుత్తము మిత్రులార! కడంకతో
నుల్లమందలి చింతయంతయు నొక్కసారి యడంగఁగన్.

తరళ.

బాను—మనసులోపల సంతసంబులు మల్లడింపఁగ వేడుకన్
ఘనులువీరలు పాడియాడుచుఁ గాలమొక్కక్షణంబులోఁ
జనఁగఁజేయుఁడు మీరుసేర్పున బాగుచేయక యివ్వడిన్;
దినుఁడు వేఁడెద మిమ్ము నే శుభవేళ యియ్యదిగావునన్

సుగంధి.

విజ— క్రొత్తపెండ్లికూఁతులార! క్రొత్తక్రొత్తపాటలన్
చిత్తరంజకంబుగాఁగఁ జేయిమీరు పాడుఁడీ;
పుత్తిమిప్పుడించుకంత ప్రొద్దునవ్వులాటలన్
నృత్తగీతవిద్యలందు నేర్పుచూపి తన్పుఁడీ

పంచచామరము.

కామ—కరంబుమీకు సౌఖ్యమిచ్చుఁగాత రాత్రివిందిటన్;
దరంబులేక యెల్లవారుఁ దద్దయున్ముదంబునన్
బిరానపాటపాటలందు వేడ్కయింత చూఁపుడీ;
పరాత్పరున్ స్తుతించి భక్తిఁబ్రార్థనంబు సల్పుఁడీ.

ఉత్సాహ.

సుదంత—వ్యసనమెల్లఁబాఱఁద్రోలవలయు మదులనుండి నేఁ
డసమమైనసంతసమున నలరవలయు నెల్లరున్;
వెసను మనము చేరియిందు వింత వింత క్రీడలన్
జెసలుమాఱ్చమోయ వేడ్క తెలుపవలయు నిత్తఱిన్.

స్రగ్విణి.

సుద—ఇందుఁగూర్చున్నవారెల్ల నల్లంబులన్
బొందుగామోదముంబొంది యీరాత్రి యీ
మందిరంబందు సమ్మాన మొప్పారఁగన్
విందుతై వీరిదీవింపుదుర్ గావుతన్.

(అంపఱు నిష్క్రమించుచున్నారు.)

సంపూర్ణము.

శ్రీ

# వినీసువర్తకచరిత్రము

---

ఇది

చెన్నపురిరాజధానియందలి దొరతనపువారి కాలేజీలో

తెనుఁగు పండితుఁడుగానుండిన

## కందుకూరి - వీరేశలింగము చేత

రచియింపఁబడినది.

---

తణుకు.

డి. వి. రమణారావుగారి
శ్రీ సౌదామినీ ద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1914.

---

# వినీసు వర్తక చరిత్రము.

## ప్రథమాంకము.

### ౧. రంగము—వినీసుపురములో నొకవీథి.

[అంటోనియో, సాలారినో, సోలానియో, ప్రవేశించుచున్నారు.]

ఆంటో—ఏ నెలనిజము గానిటువ్యసనంబు
గా నున్న వాఁడనో కాని యెఱుంగ;
ఏమియుం దోఁచదు నామదికిపుడు
నీమది యదిమాది నొగులొందెద నను;
మదిచింతకుఁ గతంబు మఱియేదిగలదో
యదివచ్చి నన్నేలయాశ్రయించినదొ,
చింత యనఁగ నేమొ, చింత యెద్దాన
నింతగఁబుట్టెనో, యెఱుఁగంగవలయు
నను నేనెఱుంగుట కనువుగానంత
చెనఁటివానిని జేసెఁ జింత నన్నిపుడు.

సాలా—నీచిత్తమంతయునీరధిమీఁది
కేచని చాంచల్య మొనసెడుఁ జూడ.
అచ్చట నీయోడ లతిశయం బగుచు
మచ్చట యౌచాపమొత్తంబుతోడఁ
బ్రభురత్నముల కేలివణిజులఁ బోలి
(ప్రభ గల జలధిదేవతలను బోలి,)
తమతమ తెరచాపగములను దాల్చి
యమితనమ్రత దోఁప నాతోఁగఁబట్టి
చిన్నయోడలచాలు చేరువనుండి
క్రన్ననఁ జనునెడఁ, గాంచి యవ్వాని
గారవించుచు క్షేమకరయాత్ర చేయు
వారిధిలో నెల్లవానిని మించి,

సోలా—విలువవస్తువు లట్టివింతవి నావి
జలనిధిమీఁద దవ్వుల నుండెనేని,
మనసెల్ల వాఁటిమీఁదనె యుండు నాకు
ఘనతర ప్రేమంబుకతమున నెపుడు;
గాలి యేతంకకుఁ గదలునో చూడ
గాలిలోఁ బట్టుదు గడ్డిపోఁచ నెపుడు;
దేశపటంబులఁ జెరువులు రేవు
లాశమై పరికింత లరయుచు నుందు;
జారవచేఁ బంపినసరకుల కింత
దురదృష్టకరమని తోఁచెడునట్టి
ప్రతినిమిత్తముఁ జూచి వ్యసనాతిశయత
మతిచెడి యుండుదు మఱి తప్పకుండ.

సాలా—వాడుకగాఁ గాఁచు పలచని
పులుసు
వేఁడి చల్లారంగ విసరెదు నపుడు,
అతిమాత్ర మగుగాలి యంబుధిమీఁద
మితిలేనికష్టంబు జతగూర్పఁ దగుట
తలఁపునఁ బొలుచుఁ గలుగును నాకు
చలిజ్వర మొదవిన చాడ్పునఁ గుదుపు
ఇసుకబల్ల గడియార మీక్షించునప్పు
డిసుకతిన్నెలు మిట్ట లెదకుఁ గాన్పించు;
దాన, 'నాఁగ్రమా! యనఁబడును నాయోడ

కావున వెలహైన స్వపరకులకోవ
మిట్టc బట్టుదు నేల మీcదికి నొంగి
యెట్టులో యద్దాని యెత్తయిన శిరసు
పుడమిని ముద్దాడువడువున నోవ
కనుగొనకన్నను గనుక్రింద వాలి
పసచెడి యిసుకలోc జొcతుకొన్నట్టు
పొసcగ నామదికిని బొడకట్టుసుమ్మ ;
దేవాలయముcజేరి దివ్యమండపము
పావనశిరఃశిలాభాగంబుc గన్న,
స్మరణకు శిలాచయములు వచ్చి
గిరి తాcకి నాయోడ సరగునc బగిలి
దానిలోcగల సుగంధద్రవ్యసమితి
యానీరనిధినిండ నలమిన ట్లు,
నాసి, కెక్కిన పట్టువస్త్రముల్ జలధిc
గైసేసి నట్లును గాన్పించు మదికి.
వేయేల? పోరాద వెల గట్టరాని
యామోడ క్షణములో వ్యర్థంబు గాను ?
ఇట్టితలంపులు హృదయంబునందుc
బుట్టకుండునె నాకు ? పుట్టినయపుడు
తలcపులc బొడమి దైవసంఘటనము
కలిగినతేc జింత గదురు నటంట ?
'ఆంటోనియో' యొక్క వ్యసనకారణము
కంటిని జెప్పనక్కరలేదు నాకు—
అతనికి వాణిజ్యమందున మిగుల
మతిపోయి చింతచే మఱుcగుచున్నాcడు.

ఆంటో—కాదు కారణ మదిగట్టిగా నమ్మ ;

నాదు వ్యాపారంబు నమ్మి యింతయును
నొక్కయోడనె కాని యొకచోటనె కాని
చిక్కcపడcగ నుంచినవాcడcగాను.
సౌభాగ్యమును సెల్లనమ్మి యీయేటి
లాభంబుమీcదనె లలి నుంచలేదు.
కావున వాణిజ్యకర్మంబుcబట్టి
నే విచారం పడ నాంతశ్రమైన.

శాలా—అటులైన నీవు కామాగ్నిచే నొక్క
కుటిల కుంతలికయి కుందుచున్నావు.

ఆంటో—నేనేమియూ నెఱుంగ కింత గట్టకుము.

శాలా—మానినిమీcది ప్రేమయూ లేదనీకు?
అటు లయ్యె నేని మేమనవచ్చు నిన్నుc
దటుకున మోదంబు తగ్గినందునను
వ్యసనంబు పడుచున్న వాcడవంచి పుడు,
వసుధనవ్వుచుc గ్రుళ్ళి వ్యసనంబులేమి
నానంద మొందితి ననికూడ సులభ
మైనట్టిహేతు వీవమరింప వచ్చు.
ఇలమీcద సృజియించె నిపుడు దైవంబు,
చెలcగి రెండుతలల 'జేనసు' దేడు,
చాలవింతలు గొల్పు జనశిఖామణులc
గాలమాహాత్మ్యంబు కారణముగను
కలదు కొందఱు నిప్పుకను లర మోడ్చి,
చిలుకలవలె నెపుడు తెలివేమి లేక,
తిత్తియూcదెడువానిc దిలకించి కూడ
నెంతొ బిగ్గర నవ్వుచుండెడివారు ;
కుంభినిపై మఱి కొందఱు గలరు.
గాంభీర్యశాలి యగు గణన గన్నట్టి
యల 'నెస్టరం'టటి యనఘుcడు వచ్చి,
పలుకcబడిన హాస్యవచనంబునకును
దగుమ నవ్వcగ ననిశా నొప్పుకొన్నc,
దగువమైc బెదవులు తెఱచి యొకింత

దుష్ట్యాక, వికృతంపునటనల మోము,
క్రౌర్యసంగ, మూసుచుకొనియుండువాడు.

[బస్సానియో, లోరెంజో, గ్రేషియానో,
ప్రవేశించుచున్నారు.]

సోలా—వచ్చుచున్నాఁడు నీబంధువౌ ఘనుఁడు
మెచ్చి 'బస్సానియో,' మిత్రులైనట్టి
'గ్రేషియానో'ను, 'లోరెంజో'ను గలిసి
భాషింప వరసఖుల్ వచ్చిరి కాన,
సెలవు గైకొనెద మేలమి మేమిపుడు.

కాలా—విలువ హెచ్చుగఁ గల చెలులురాకున్న,
నీకు సంతోషంబు నెలకొన్న దాఁక
నీకడనే నిల్చి యే నుందు సుమ్మి.

ఆంటో—చెలికాఁడ! మఱినీదువిలు వయుంగూడ
వెల లేనిదే సుమ్మి విను నామతమున.
వేఱేదియో నీకు వెళ్ళవలెంగఁ
దీఱనిపని యుండి, దీనిని సందు
కావించు కొని యేఁగఁ గాంక్షింతు వనుచు.
భావించెదను నేను వాస్తవంబుగను.

కాలా—అటుగ, నోప్రభులార! ఆజ్ఞ యిచ్చెదరె?

బస్సా—మరల నేకంబుగా మనమెల్ల నెపుడు
కూడి, చెప్పుఁడు మీరు, కూరిమి మీఱ
వేడుకతోఁ బ్రొద్దు వెళ్ళింపఁ గలమొ.
ఇట్లు మీరంతంత కఱవగుచుంటి,
రిట్లౌట న్యాయమే యరయంగ మీకు?

కాలా—చిత్తము. తీరిక చేసికొంచొకట
వత్తుము మిముఁగూడి పలుకు లాడంగ

[కాలారినో, సోలానియో,
వెళ్ళుచున్నారు.]

లోరెం—'ఆంటోనియో'తోడ నమరంగ నిన్ను
జంటగఁ గూర్పుట సమకూడెఁ గాన,
'బస్సానియో' ప్రభూ! వదలి నిన్నిచట
లెస్స మే మెందేని లీలఁ బోయెదము.
కాని, భోజనవేళఁ గలయంగవలయు
స్థానంబు, దయచేసి తలఁపున నిలుపు.

బస్సా—కలిసికొందును మిమ్ముఁగనితప్పకుండ

గ్రేషి—కలదె, 'యాంటోనియో! కారణ మొకటి?
కనఁబడెదవు నీవు కళదప్పినట్టు.
వినుము నీవీలోకవిషయంబులందు
నతికాంక్షతో నుందు వనవరతంబు.
మతి నెప్పుడుఁ బ్రపంచరతు లగునట్టి
వారు సుఖంబును బడయంగలేరు.
నీరూప మదియేమొ నిజముగా మాఱె.

ఆంటో—ఎట్లుమాఱఁ దగునొ యీ ప్రపంచంబు
నట్లె చూచుచునుందు ననయంబు నేను.
సమబుద్ధిఁ జూడ నీజగన్మండపంబు
రమణీయనాటకరంగంబు సుమ్మ;
ఎల్లవారును దమ కేర్పడ్డకథను
తెల్లుగ వినిపింపఁ జెడనివేషమున,
కలయ దుఃఖకరంపుఁగథ వినిపింప
వలయునంతిప్పుడు పడెనో నాపాల.

గ్రేషి.—పరిహాసకుని వేషభాషలు నేను
ధరియించి యానందభరితుండ నగుచు
ముదిమివచ్చెడుదాఁకఁ బుత్తుఁగాలంబు
మదిచింత మూల్గుచు మఱుఁగుటకంటె
పోయిగాఁ దినిత్రాగి యలరుచునుందు.
కాయమునను శక్తి గలయట్టినరుఁడు,
ఱాతిపై మలఁచినతాతను బోలి,
రోఁత పుట్టఁగను గూర్చుండంగ నేల ?
ఏలనిద్దురవబ్బు మేలుకొన్నపుడు ?
చాలిమిఁ బనిలేక మటమట మనుచుఁ
గామలరోగంబు గాంచంగ నేల ?
నీమీఁద నాకెంతొ ప్రేమంబు గలదు ;
ఆప్రేమమే నన్ను నదనఁ బ్రేరేఁచె
నీప్రకారము నీకు హితమును జెప్ప.
తెలియఁజెప్పెద, నీవుతిన్నఁగాఁ వినుము ;
నిలుకడగా నీరు నిలుచుటఁజేసి
పాకుపట్టుతటాకంబుఁ బోలి,
పైకి ముఖంబున వైవర్ణ్య మడరఁ,
బుడమి లోకులు తమ్ము బుద్ధిమంతులఁగఁ
గడు వివేకంబును గలవారిఁ గాఁగ
గాంభీర్యశాలులఁ గాఁ జెప్పుకొనఁగ,
దంభపుమౌనంబుఁ దమయంతఁ దాల్చి
'నావాక్యమే యెందు దేవవాక్యంబు
గావున, నామాట కేవారు నెదుర
చెప్పఁగూడ'దనెడి చిఱువాక్యముననె
యెప్పుడు గౌరవ మిలఁ బొందవలయు
తరగతిలోఁ జేరు నరులును గలరు.
నిరతము మౌనంబు ధరియించినట్టి
హేతువుచేతనే యిట ధీరులనుచు
ఖ్యాతిఁ జెందుచున్న ఘనులనెంతఱిని
యెఱుఁగుదు నేను ; మఱి యట్టివారి
వెలువక తమనోరు లెంచి మాటాడ
నెన్నఁడేనిఁ దెగింప రంతకాలాన,
మున్న తమ్మెంతయు మన్ననఁ జూచు
పటుమతు లగుమిత్రపరులవీనులకు
కటువులుగా నుండి కలిగింప వ్యసన,
బిచ్చివారని వారు పిలువకపోరు.
వచ్చి యింకొకసారి యిచ్చట నీకు
నీవిషయము చాల నెఱిఁగింతు నేను.
నీవిటు చింతనా నెగడు గాలమున
జను లిచ్చుఖ్యాతి యనెడు చేఁప
కొఱకు
నెడఁద యనెడు గాలమును గడుఁ గలంప
కుము—
రారమ్మ పోదము, 'లోరెంజా!' మన
ము—
కోరిన సెలవిమ్మ కొంచెముసేపు ;
నడిచి యిప్పుడె భోజనము చేసి వచ్చి
కడముట్ట హితబోధ గావింపఁ గలను.

లోరెం.—చనెదము భోజనసమయంబు
దాఁక
నిను నిప్పుడిచట మీనెలవున విడిచి.
'గ్రేషియానో' యెందుఁ గించిత్తు నన్ను
భాషింప నీయఁడు, పదిగ నట్లౌట
నతఁడిప్డు వర్ణించినట్టియామూఁగ
మతిమంతులం దొక్క-మాన్యుండ నౌదు.

గ్రేషి.—సహవాస మొకరెండుసంవత్స
రములు
మహిమీఁదఁ జేయుము మఱియు నాతోడ,
నీవు వినక యుండు నీనోటిమాట.

ఆఁటో—సేవక్తనమ్మొద నీనిమిత్తంబు; చేయుటకును మాఱు, చేతికొలంది
మంచిది యిప్పుడు మఱిపోయి రండి.    ధనము వెచ్చించుచు దంభము పూని
గ్రేషి—మంచిమాటంటివి, కాంచు వం    ఘనుఁడని జనులచే ననిపించుకొనఁగ
దనము.    స్థిరమైన యట్టినాస్థితిని నేనెట్లు
మౌనంబు తగు, నోపలేనిపనులకుఁ    గురుకొని చెడఁగొట్టునో నీకు
బైనంక నాధుఁ డ్బ్బసికన్యలకునె.    సకలంబు తెలిసినసంగతి గాదె?
[గ్రేషియానో, లోరెంజో, వెళ్ళు    వికలత్వమొందదు వినుము నామనసు,
చున్నారు].    మునుపటివలె వ్యయ మొనరింప నిపుడు
ఆంటో—ఇతనిమాటల యుక్తియేమైనఁ    పనికిరానియవస్థ ప్రాప్తమాటకును.
గలదె?    ఇప్పుడు నాకున్నయెదచింత యెల్ల
బస్సా—ఇతఁడు వినీసులోనెల్లరకంటె    నప్పు డతివ్యయ మరయక చేసి
నధికంబుగ నిరర్థకాలాపములను    తెలివి లేమిని బైకిఁ దెచ్చుకొన్నట్టి
వృథవచింపుచునుండు; వివరించిచూడ    పలుఋణములనుండి బయలఁబడంగఁ
గంపెడుపొల్లులోఁగలిసి లోపలను    న్యాయమార్గముచేత నాకెట్టులౌదవు
నింత్రుగా వరిగింజ లెండేని రెండు    నోయని కాని, వేఱొక్కటి కాదు.
గలమాడ్కి నితనివాక్యంబులలోనఁ    ధనముచేఁ బ్రేమచేతను మున్నె నీకు
గలుగును యుక్తియుక్తములైనవియును.    ఋణపడి యున్నాఁడ నెంతయు నేను
కనుఁగొన వానినిదినమెల్ల బట్టు;    నామీఁద నీకున్నప్రేమను బట్టి,
కనుగల్గి శోధించి కనుఁగొంటిమేని,    యేమాడ్కి నాయప్పులెల్లను దీర్పఁ
పడినశ్రమమునకుఁ బ్రతిఫలమింత    దలఁచినాఁడనొ నేను, దానికినాకుఁ
పడయంగఁ జాలము వాస్తవముగను.    గలయూహ లాధారములుఁ, బూర్తి
ఆంటో—ఏసతిగృహమునకేఁకరహస్య    గాను
ముగ మదివిప్పి నీతోడ మఱిచెప్పి నాదు.
నాసమై యాత్రచేయుంగను నీవు    హృదయంబుబరువెల్ల సేదించుకొందు.
ప్రమొక్కుకొనితివో యాముద్దియపేరు    ఆంటో—చెలికాఁడ! సర్వంబుఁ దెలుపు
నిక్కంబుగాఁ జెప్పు; నీవీదినంబు    పుమి నాకు
తప్పక చెప్ప వాగ్దానంబు నాకు    చెలఁగి నీవెప్పుడుఁ జేసెదుకరణి
నప్పుడె చేసి యున్నాఁడవు కాదె?    నదిగౌరవావహమైనదేయైన,
బస్సా—ఆయంబుగని పెట్టి యర్థమా    ముదమున నాయర్థమును శరీరంబు
వ్యయము తక్కిఁన సర్వసాధనములు నావి

యుక్క—అతను నీకు ననుకూల పడఁగ
నీయధీనంబులు నేఁ జేయువాఁడ ;
వేరేల ? నాయెడ విశ్వాస ముంచు.
బసా—బాలుఁడ నయి పాఠశాలకు
జనువు
కాలంబునను నేను గడువేడ్క మీఱ
విలువిద్య గఱచుచు విడిచినబాణ
మిలఁబడి కనఁబడ కుండేని నడఁగ,
మఱియొక బాణంబు గుఱిపెట్టి తొంటి
తెఱఁగున నాదిక్కు తిన్నఁగా వదలి
శరపాత మగుచోటు శ్రద్ధతోఁ జూడ,
దొరకును దఱచుగాఁ దూపులు రెండు.
చిన్నప్పటి దగునాచేష్టను బోలి
నిన్ను వేఁడఁగఁ బోవుచున్న సాయమును
దుష్టంబు కానిదై తోఁచును గాన
దృష్టాంతముగ దానిఁ దెచ్చుచున్నాఁడ.
కడు నీకు నే ఋణపడి యున్న వాఁడ.
నెపేఁద నప్పునుదీర్ప నిచ్చిందు పేద
బాలునిగతి సంభవం బయి యిపుడు
పోలఁగా నష్టమైపోయె నాయప్పు
సదయత నింకొక సారి యొకమ్ము
మొదల వేసినయట్లు వద లెదవేని,
ఘనతరజాగ్రత్తఁ గనిపెట్టి యుండి
కాని తెత్తు రెంటిని గూడ నే వెదకి ;
ఒక వేళఁ దేలేక యుండితి నేని
సకలవిధంబుల సాధించి తెచ్చి
కడదాని నర్పించి, కడమదానికయి
యుండఁ గృతజ్ఞుఁడ నయి ఋణపడి
యుందు.

అంటో—ననుజక్కఁగా నెఱిఁగినవాఁడ
వయ్యు
బలికిమాలిన దీర్ఘవర్ణనలందు
దిగి కాలమును వ్యర్థముగను బుచ్చెదవు.
తగినమిత్రునివాంఛితము దీర్చుకొఱకు
నిర్విచారముగ నేనిత్తునో లేదొ
సర్వస్వమును నంచు సందేహపడుచు,
నాసొత్తునెల్ల దుర్వ్యయమునఁ బాడు
చేసినంతకంటెఁ జింతాతిశయమునఁ
గలగించుచున్నావు కరమును నాకు.
చెలికారమును నెంచి చెప్పరే చెప్పు
నాచేత నగునని నమ్మకముగను
నీచిత్తమందున నీవెంచినట్టి
పనిదేని నైనను బరగునఁ జేయఁ
గనిపెట్టి సిద్ధముగా నున్నవాఁడ.
బసా—కలదు 'బెల్మంట్' ను గ్రామంబు
నందు
జలజాక్షి యొక్కతె సౌందర్య రాశి ;
'సౌందర్య' మనుమాట చాల దాయింతి
యందమ్ముఁ దెలుపంగ నావంతయేని ;
ధనవంతురా లామె గుణవంతురాలు.
మును గొన్నివేళల ముదమొప్పఁ దనదు
కనుదామరలనుండి కరుణమై నాకుఁ
బనిచెను ధ్వనిలేని వర్తమానములు.
ఆమె నామము 'పోర్షియ' అరసిచూడంగ
నేమిటఁ గొఱవడ దించుకయేని,
కేటోకుఁ గూఁతురై మేటి యైనట్టి
'బ్రూటను' భార్యయౌ 'పోర్షియ' యను
సతికి.

మృగనేత్రిమహిమంబు మితిలేనియట్టి
జగమెఱుంగనిది లేశంబును గాదు ;
ఆమెను జేపట్ట నాత్మలం గోరి
కాముకజనులు నల్గడలయందుండి
పలువురు ప్రసిద్ధులు వచ్చుచుందురు.
తళతళలాడెడి తరుణిముంగురులు
కనకకేశంబులకాంతిని బూని
కణతలపైవ్రాలి, ఘనతం దానున్న
‘బెల్మంటు’ గ్రామంబుం బెను ‘కాల్చిసు’
నుగ
మేల్మిం జెందింపంగ, మెచ్చి కరంబు
చేరుదు రచ్చోటు ‘జేసను’ వంటి
వార లనేకులు వామాక్షికొఱకు.
ఉరవుగా వారిలో నొకరితో నైన
సరి మీఱంగం జాలెడుసాధన మున్నం,
గాంతను దప్పక కైకొనం గల్గు
నంతమహాదృష్టవంతుండ నౌదు
నని నిశ్చయంబుగ ననఘుండ ! యిప్పుడు
ఘనమైన నమ్మిక కలదు నామదిని.

ఆంటో—ఈమెడనాధన మెల్లను జలధి
నే యున్నదని నీ వెఱుంగుదు కాదె ?
రొక్క మొండెను, నట్టి రొక్కంబుం
గూర్ప
నిక్కడ నరకొండె నిప్పుడులేదు ;
కావునం, బురిలోనం గలయంగం దిరిగి
యీవు విచారింపు మెంత ఋణంబు
పుట్టంగలదో నన్నుంబట్టి యీతఱిని ;
గట్టిగా నానమ్మకం బెల్ల నిందు
వినియోగ పఱిచెద, ‘బెల్మంటు’ నకును
వని నీవు ఘనతతో సాధ్వి వరింపం
దగియుంటకయి పట్టు ధనము నిప్పింప.
తగుధన మెవ్వారిపగ్గఱం గలదో
సరకునం గనుంగొని చనుదెంచి చెప్పు
అరిగెద నిపుడేను బాపనికొఱకై.
నాపేరిటను గాని నాకున్నయట్టి
యీపలువస్తుసంహతిమీఁదం గాని,
వలసినధనమును బడయుటకేను
గలలోను శానుదీయం గలవాండంగాను.

(అందఱు నిష్క్రమించిరి.)



౨. రంగము—బెల్మంటుగ్రామము.

పోర్షియ గృహమునందలి గది.

[పోర్షియ, నెరిస్సా ప్రవేశించుచున్నారు.]

పోర్షియ—నాయల్పదేహంబు, నాతిరో
వినుమి,
నాయాన యిపుడీఘనప్రపంచంబు
తోడను విసుగొంది తొట్రిలం జొచ్చె.

నెరి—చేడియరో! నిన్నుం జేరియున్నట్టి
మితి మీఱుపటుసౌఖ్యవితతులయట్లు
యతికష్టములు వచ్చి యేలయిందు నేని,
విసుగుపుట్టంగ వచ్చు విశ్వంబుమీఁద.
వసుమతిపై నొక్కచింతను జూతు
నది యేమొకో కాని యాహారమునకు
మొదలె యేమియు లేక పడిగంబస్తుండు
కడుపేద లెట్లో యాకైవడి గాన
కడువెక్కసంబుగం గుడుచువారలును
బాధితు లగుచుందురు వ్యాధులచేత.
ఈధాత్రి నిటుగాన నెంతయు సుఖులు
సతతంబు మధ్యమస్థితి నుండువారె.
అతిధనవంతు లెందఱాప్పయు [illegible]

తెగుచుందు, రటు గాక దీర్ఘాయు
వులగఁ
దగుపాటిస్థితిమంతు లగుదు రెల్లెడల.

పోర్షి — పడఁతుకరో! నీతివాక్యంబు
లహహా!
కడు నింపుగాఁ జెప్పఁబడియె నిర్యో
డను,

నెరి — ఇంత కంటెను నవి యింపుగా
నుండుఁ
గాంత! యనుసరింపఁగాఁ బడు నేని.

పోర్షి — ఇదిమంచిపనియని యెఱుఁ
గుట వోలె
నది చేయుటయుఁ గూడ నవనిలో నంత
సులభమే యౌనేని, యిలనీఁవ గల్గు
చలుచిన్నగుడులెల్ల బహువిశాలంబు
లయినట్టిదేవాలయంబులు గాఁగఁ,
గుయి వెట్టుబీదలగుడిసె లన్నియును
స్థిరములౌ రాజమందిరములు గాఁగ,
నరయఁగా నెన్నెడ నయియుండుఁ జుమ్మి.
తన చేయు నుపదేశమును బట్టి నడుచు
కొనువాఁడు దేవుఁడేయని చెప్పవచ్చు ;
నే నుపదేశించునీతులఁ గ్రమము
గా నాచరింపఁగఁ గలవారిలోన
నొక్కఁడనయి యైన నుండుటకంటెఁ
జక్కనిసద్ధర్మనమితిని నేను
గరముసు సులభంబుగా నన్యజనుల
కిరువదిమందికి నెఱిఁగింపఁ గలనుఁ.
ఇద్దర మనయింద్రియోద్ధతి నణఁప
బుద్ధిచే శాసనములఁ జేయవచ్చు
గాని, యవ్వాని కాగ్రివాగుణమింత
యేనియు లోఁబడ కాగక లంఘించుఁ.
బలహీన మౌనట్టివలలఁ ద్రెంచుకొంచు
వెలిదూఁకు శశకంబువిధమును బూని
మతిహీనుఁడవఁ జనుమాణవకుండు
హితబోధను గణింప కేడగాను దాఁటు.
కాని, యిట్టి విధవాద మేను జేయఁగఁ
బూనుట, నాయంతేఁ బురుషుని నేనె
వరియింప వలె నను వాంఛతోఁ గాదు
వరియింపుదుటా! యెంతభాగ్యంబె నాకు ?
నేనిష్టపడునట్టివాని వరింపఁ
గా నెంచెడ, నిష్టంబు లేనట్టివాని
వరియింప కొక్కట వలదంట కొండె,
నరయ నేను స్వతంత్రురాలను గాను ;
మరణమొందినతండ్రి మత్రి వాసిచనిన
మరణశాసనమున మగిడింపఁబడుచు,
బ్రదికియున్న కొమార్తె పటుమానసంబు
వదలని వెనుకట్టుబాటున నుండె;
కాంచి యొక్కని వరియించుట కొండె,
మించి యేరి నిరాకరించుట కొండెఁ
జాలనిదశ నాకు సంభవంబగుట
చాలఁగష్టంబు గాదె? చానరో! చెపుమ.

నెరి — పుడమి నీజనకుండు పుణ్యాత్ముఁ
డౌతో ;
కడుపుణ్యు లవసానకాలంబునందు
సలరుచుందురు దేవతావేశమునను ;
కలికిరో! యటు గానఁ, గ్రమముగాఁ
బన్నెడి.
వెండిని, సీసంబుఁ బెట్టి చేయించి
యుండిన పెట్టెల నొకదానిఁ దనదు
సంకేతముఁబట్టి సరియైనదానిఁ

గొంతు చెందక కోరుకొన్నట్టివాఁడె
యిల నీకు భర్త కాఁగలవాఁడటంచు
సలిపితనిపిరాజనకువరీక్ష
కారణంబున మాటఁ గ్రొత్తమైన వెట్టి
గోరుకొనెడువాఁడుకూర్మి నీమీఁదఁ
దప్పక కలవాఁడె తప్ప వేఱొకళ్ళఁ
డెప్పుడుఁగానేరఁ డిదినిశ్చయంబు.
విన నిప్పుడు నిన్ను పాలింపంగ
బూని వచ్చిన రాజపుత్రులైనట్టి
కాముకవరులపైఁ గలయట్టినీదు
ప్రేమ తెలుంగుమ చేర్వేరఁ జెపుదె?

పోర్ష్య—వారి నామంబులు వరుసతోఁ
జెప్పు

వారివారిగుణానువర్ణనం బేను
జేసెదఁ జేల్మి వు చెప్పుచు రాఁగ,
చేసెదువర్ణనవాసిని బట్టి
యెవ్వరెవ్వరిమీఁద నెంతెంత ప్రేమ
నివ్వటిల్లెనొ నాకు నీవెఱింగెదవు.

నెరి—వారిలోఁ దొలుదొల్త వచ్చెడు
వాఁడు
పేరగు 'నేవల్సు' పృథ్వీశసుతుఁడు.

పోర్ష్య—అతఁడు తలంపఁగ నశ్వలో
లుండు.

సతతంబు తనవాజిసంగతి తప్ప
మఱియొకవిషయంబు మాటాడఁడె
పుడు
తలుదుగాఁ జెప్పెనుదనగుఱ్ఱమునకుఁ
దానె లాడము గట్టఁ దగువాఁడనంచుఁ
బూని వచ్చిన బుద్ధిహీనతను.
అమ్మాటలనుబట్టి యాతనితల్లి
కమ్మగవానికిఁ గనెనేమొ యతని
ననుచు సంశయ మయ్యెడును నాకుఁ
జాల.

నెరి—వెనుకను 'పోలండు' జనపతి
గలఁడు.

పోర్ష్య—మొగము చిట్లించుకొనుటయొకటి
తక్క—ఁగ
నకట! వేరొకపని యతనికిలేదు;
'నను గోరవేని' నన్యునిఁ గోరుకొమ్మ
యని చెప్పునట్లుండు నతనిముఖంబు,
నవ్వు వచ్చెడికథల్ నెవ్వడి వినుచు
నవ్వఁడాపాపంబునను బోవఁ డెపుడు
తనపూర్ణయౌవనదశయందె యిట్లు
పనిలేనిచింతలో మునిఁగి యున్నతఁడు
ఐయసు మీఱుకొలంది వ్యసన ప్ర
ధానుఁ
డయిన యాపండితుఁడగు నేమొ
చూడ
ఈయిరువురలోన నెవ్వనినైన
న్యాయంబుగ వివాహమాడుటకంటె,
ఎముక నోరను బూని యొంపఁగొడునట్టి
యముని సైనను బెండ్లియాడఁ గాం
క్షింతు,
వీర లిద్దఱచేతఁ జేరక యుండ
వారిందుఁ గాత సర్వేశ దైవంబు.

నెరి—వెలఁది! యేమనెదవు 'ఫ్రెంచి'
రాజాన
యల 'లిబా' నను రొండునాతనిఁగూర్చి?

పోర్ష్య—దేవుఁడు మానవదేహంబు
నవుడు

గావించ వాతనిఁ; గాఁబట్టి యతని
మనము గణింతము మనుజునిగాను
వినుము నేనెఱుఁగుదు విస్పష్టముగను
బఱి వాదించుట గొప్పపాతకమందు
అరయుఁగ 'నేపల్సు' నరనాథుకంటె
నితఁడు తురంగమతతులలోఁ మెలఁగ
నతిఘనుం డనవొప్పు ; నంతియ కాక,
యనుపమానగుణాఢ్యుఁ డాన్యంబు మాడ్చు
కొనుటలోఁ 'బోలండు' మహేంద్రు కన్న
తఱుదుగా నరులెల్లఁ దానెయౌఁగాని
మఱి వేఱెతానొక్క మనుజుండుగాఁడు
ఒకపక్షి పాడిన; నోగినందుకొందుఁ
డేక తకమని లేచి తాండవమాడు ;
తననీడతోడనే తగ సాముచేయు.
విను మాతనిని భర్తఁగను జేసికొన్న,
నిరువదిమందికి నిల్లాలనయిన
కరణి యగును జుమ్ము కాంత? నాబ్రిదుకు.
నతఁ దిరస్కారంబునను గోరఁడేని,
కనుగొని యాతని క్షమియింతు నేను ;
వినుమంతయేకాని, వెఱ్ఱిమోహమున
నను నాతఁ డత్యంతమును గోరు నేని,
బదులువహించి యవ్వానిపై నేను
సదయత వహియింపఁ జాల నెన్నటికి.
నెరి—ఏవాక్యమును బలెకె 'దింగ్లాండు' లోని
ఘ్నామవరసుతుఁడు 'ఫాల్కన్‌బ్రిడ్జి' గూర్చి

పోర్ష్య—ఈవ యెఱుఁగుదు నేనితఁనా గూర్చి
యేవాక్యమును వచియింప లేనంట
తెలియ నాతఁడు పల్కు పలుకులు నాకుఁ
దెలియ నాతనికిఁ నాపలుకు లింతైన.
'లాటిను' తేట తెల్లపు 'ఫ్రెంచి' తగిన
పాటి 'యిటాలియా' భాషలలోన
నెఱుఁగఁ డేదియు నాతఁ డించుక యైన ?
మఱియు 'నింగ్లీషు'లో మహిఁ గవ్వయైనఁ
జేయ నే నని నిల్చి స్థిరముగా నీవె
న్యాయసభలఁ బ్రమాణముచేయఁ గలవె.
అతఁ డెంత యును సుందరాంగుండె కాని
సతతంబు నెఱమూగసంజ్ఞలతోన
యెవ్వరు మాటాడ నిల నోపఁ గలరు?
నవ్వులాటగఁ దోఁచు నను గోరు టతఁడు,
'ఇటలిలోఁ' జొక్కాయి, యట 'ఫ్రాన్సు' నందు
బటువయినయిజారు, పరఁగుకుళ్ళాయి
'జర్మని' లోఁగొని, సకలదేశములఁ
గూర్మినతఁ డేర్పుకొనియెఁ గాఁబోలు!
నెరి—అతని సమీపస్థుఁడయిన 'స్కాట్లాండు'
పతిని గూరిచి యేమి పలికెదు నీవు?
పోర్ష్య—పొరుగువానికితండు పరమోపకారి;

వరియించువిషయమౌ వాగ్వాదమందు
గట్టిగా నొక లెంపకాయను బొంది.
పట్టుతో 'నింగ్లీషు' వానికి గానిఁ
దనచేతశక్తి గలిగినయప్డు తీర్థ
ననుదుఁ బ్రమాణంబు నొనరించెనితఁడు.
అడ్డువచ్చిన 'ఫ్రెంచి' యతఁ డాబు
ణంబు
వస్త్రితో నిడ. బూఁటపడెనని యొంతు,
నెరి—పడఁతిరో! 'సాక్సనీ! ప్రభు
నన్న కొడుకు
పడుచు 'జర్మను' నెట్లు భావింతువీవు?
పోర్షియా—తెలివిగలిగియుండు దిన
పూర్వభాగ
ములనె యాతని నీచముగఁ జూచు
చుండు
స్మరణ తప్పఁగఁ ద్రాగు మధ్యాహ్న
వేళఁ
గరము నీచతమముగాఁ జూచుచుండు.
ఘన వివేకము చాలఁ గలయప్పుడె
మనుజానికంటెను మరితక్కువగును
మిగులంగనవివేకి యగునప్డు దత్తడ
మృగముకంటె నొకింత మెఱుఁగుగా
నుండు,
ప్రాణగండమువచ్చు పట్టునవయినఁ
ద్రాణమై నేదేని తంత్రింబుపన్ని
పతినిగానీతని వరియింపకుండఁ
గొతుక తప్పించుకొనుదాననేను.
నెరి—వరియింపఁగాఁ బూనివచ్చియో
తండు
[illegible] సాధించునపుడు,

నీవువరింపక నెపపెట్టియితని
బోవఁ బంచితి వేని, పొలఁతిరో! నీదు
జనకుండు మరణశాసనమందు వ్రాసి
చనిన—యాజ్ఞను మీఱితి చరియింపవల
యు.
పోర్షియా—అటువంటి విపరీతమిటుఁ
బుట్టకుండఁ
దటుకునసారాయి తగినంతయున్న
యట్టియద్దపుగిన్నె యాను దెచ్చికృపను
బెట్టి యుంచుము తప్పు పెట్టెయమీఁద.
లోన రాకసి నొకర్తె దానిని బెట్టి
పైనిట్టిమచ్చను బచరింతువేని,
చేరి యాపెట్టెనె చెచ్చెరనితఁడు
కోరునం చెఱుగుదుఁ గుతుకంబుతోడ.
వినుమిట్టిపానవమూర్ఖుని జేసికొనక
మునుపు నేనేమి చేసినఁ జేయుదాన.
నెరి—ఈవు భయంపడ కీపరిభంగులందు.
నేవాఁడుగాని నీ కేలిక గాఁడు;
నోరెత్తి వారి మనోనిశ్చయముల
వారెరింగించిరి వరుసగా నాకు;
పెట్టెలఁబట్టియే పితృనియోగమున!
గట్టిగావరియింపఁ గాంతునినంట
మానివేరొక మంచిమార్గంబు నీవు
పూనిచూపినఁ దక్క, బోదురువార
తమతమ గృహములదారిని బట్టి
శ్రమపెట్ట కిఁక దర్శనములతో నిను
వరియించుతలఁపులు వడిగట్టిపెట్టి
పోర్షియా—విను 'సిబిల్లా' యంత వృద్ధ
కామిని!
మనుదునేని, 'డయానా' మాడ్కిని నేను

పరిశుద్ధకన్యకాత్వమునందె యుండి
మరణంబు నొందుదు ; మఱి యంతె కాని
జనకుండు మరణశాసనమందుఁ బనుచు
ఘనవియోగము మీఱఁ గలదానఁ గాను.
ఈ కాముకులమంద యిటు వివేకంబు
చేకొనుటకు సంతసించెద నేను.
అంతయు వీరిలో, నరిగినందునకు
డెందంబులో మోద మొందంగవలయు
వారి కాని, యొకండు వీరిలోపలను
వేఱచందమువాఁడు వెదకినలేఁడు;
కావున క్షేమంబుతో వారలెల్లఁ
బోవఁగ నిండ్లకు దైవంబుఁ గొలుతు.
నెరి—వెనుక నీతండ్రి జీవించియున్నపుడు
ఘనపండితుఁడు శూరజనమండనుండు
వచ్చెనొక 'వినీసు' పట్టణవాసి
యిచ్చటికొకసారి, యింపుదీపింప
నా 'మాంటుఫెర్రటు' భూమీశుతోడ,
ఏమైన జ్ఞప్తి నీకింతయు లేదె?
పోర్షి—ఔనౌను. మఱవ 'బస్సాని
యో' యతఁడు
పేరెంతు నదె యాతనిసమాఖ్య యంచు.
నెరి—ఔను, సత్యము సుమ్మి ; యో
నాతిమిన్న !
నేను జూచినయెల్లమానవులందు
నతఁ డొక్కఁడే కడు నర్హతముండు
మతిపాత్ర యా మేలిసతినివరింప.
పోర్షి—జ్ఞప్తిలో నున్నాఁడు చక్కఁ
గా నతఁడు ;
జ్ఞప్తిఁ బట్టి, తలంప సరిగనాతండు
కరము నర్హుఁడు నీవు కావించుస్తుతికి.

[సేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]
సరిగఁ జెప్పుము సమాచారము లేమి ?
సేవ—నలువురుఁ గ్రొత్తవారలమి నీ
యొద్ద
సెలవుగైకొనియేగఁ దలఁచియున్నారు;
పేనవవాఁడయి యొసఁగు 'మొరాకో'
భూనాథుకడనుండి ముందుగా దూత
వచ్చియిటకుఁ దన ప్రభువు యీరాత్రి
వచ్చునంచును దెచ్చెవర్తమానంబు.
పోర్షి—తక్కినవారిని దయచేసిపంపఁ
జక్కగా మన్నించుచందంబుగా నె,
యైదవవానిని నంత నెమ్మదినె
యాదరింపవలంతి నయ్యెద నేని,
ఆనంద మొందుదు నతనిరాకకును
మానినిరో 'మొరాకో' మనుజేశ్వరుండు
కడు సాధు హృదయంబు గలుగు వాఁ
డయ్యు
వెడఁగురక్కసిబోలు నొడలివాఁడైన,
విను మతనిని గౌరవింతునె కాని
మనసార నొడఁబడ మఱిపెండ్లియాడ,
పాలఁతుకరో ! రమ్ము పోదము మనము
(సేవకునితో)
నిలువక యోరోరి ! నీవుపొమ్మువుల ;
వెలికొక్క కాముకు వెడలంగఁబంచి
తలుపువేసికొనుటె తడవుగానుండు ;
క్రిమ్మఱ నింతలోఁ గాముకుం డొకఁడు
గుమ్మముకడఁ జేరి గ్రుద్దును దలుపు.
(అందఱు నిష్క్రమించిరి.)

౩. రంగము—వినీసు నగరములో
నొక బహిరంగస్థలము.
[బస్సానియో, షైలాకు ప్రవేశించు
చున్నారు.]
షైలా—మాడలుమూడువేల్—మంచి
ది ; యింక ?
బస్సా—మాడలన్నియె ; మితిమూడు
మాసములు,
షైలా—మాసములునుమూడు—మం
చిది, యింక ?
బస్సా—అసామ్మునకు నెల్ల 'సాంటోని
యో'యె,
చిత్తగింపుము నేను జెప్పినయట్లు,
యుత్తరవాదిగా నుండునుజామ్ము.
షైలా 'ఆంటోనియో' బద్ధుండగు
మంచిదయ్యా.
బస్సా—వెంటనే కోరినవిత్తంబు నిచ్చి
డెందంబు నానంద మొందింపఁగలవె ;
ఇంతన కుత్తర మేమి యిచ్చెదవు ?
షైలా— మాడలుమూడువేల్—మతి
వాని గడువు
మూడుమాసంబులు—మొత్తముదీర్ప
వాడఁబడి 'యాంటోనియో' బద్ధుఁ
డగును.
బస్సా—అడిగినదానికినిదియుత్తరంబు.
షైలా—'ఆంటోనియో' మంచియతఁ
డగు నయ్యా.
బస్సా—వింటివెయెండైన వేఱు గానీవు ?
షైలా—లేదులేదింతయు లేదు లేదయ్య
ఆదట చేమంచియతఁ డంచు నతనిఁ

బలుకుట కుత్తరవాదిగా నుండ
గలఁతి యంచు మదభిప్రాయంబునుమ్మ-
అయిన నాతనిభాగ్య మంతయు నిపుడు
భయద చంచలదశఁ బడసియుండెడిని.
ఆయన కున్నట్టిమాయోడలందుఁ
బోయెఁ దానొకటి 'ట్రిపోలీకి' మ
తియు,
'హిందు' దేశంబున కేగె నొండొకటి ;
వింద నంతియ కాక విపణికే నేగి,
యొకయోడ 'మెక్సికో' కొండొకయోడ
యకట 'యింగ్లాండు' న కరిగెనటంచు ;
ఇదిగాక తక్కినయొల్లయోడలును
జెదరి యున్నవి పెక్కుసీమలయందు.
బల్ల చెక్కలె యోడ, లల్లనావికులు
—నెల్లరు మర్త్యులే ? యింతియ కాక
స్థలమూషకంబులు జలమూషికములు
పలునీటిదొంగలు స్థలతస్కరులును—
కాదోడదొంగలు—కరముసుగలరు ;
మేదినీధరములు, మితిమీఱుగాలి,
ప్రవహించుమెనునీరు బహుహానిఁ
జేయు.
అవియెల్ల నెట్లున్న, నాతండు కరము
చాలి యుండినవాఁడె—చక్కనిమూడు
వేల మాడలు;—నేను విశ్వాస ముంచి
యీయెడఁ బత్రంబు వ్రాయించుకొనుఁ
నీయ వచ్చుననియె యెంతు నాతనికి.
బస్సా—నిస్సంశయంబుగ నీవీయ
వచ్చు.
షైలా—నిస్సంశయంబుగ నే నీయ
వచ్చు

మంచి దాలోచింతు, మన్మనో రూఢి
యుండక పోదంగ, నీవిషయంబె
సేయ నెమ్మదిగ 'నాంటోనియో' తోడఁ
బూని మాటాడంగఁ బోఁగ నేనేఁడు ?
బస్సా—మాతోడ భుజియింప నేతెంతు వేని,
యాతని తోడ మాటాడంగ వచ్చు.
షైలా—వాసన గన నేమొ పందిమాంసంబు ?
మీ పరంబుగ నున్న మీ పక్షకర్త
యేసు నయ్యూను లోనఁ బెట్టిన పంది
ఘనశరీరంబును దినుటకై యేమొ.
కలియను మీతోడఁ గ్రయవిక్రయములఁ,
బలుకు లాడంగను, బయనంబు సేయ,
నీరీతి పనులు మఱెన్నిట నైన ;
ఆరయ మీతోడ నంతియకాని,
నేను భుజింపను, పానంబు సేయ,
ధ్యానంబు కలిసి చేయను భగవంతు—
(సేవకునితో)
యిపణిలో నేమైన వింతలు కలవె ?
ఇపు డిందు వచ్చెద రెవ్వరువారు ?
[ఆంటోనియో ప్రవేశించుచున్నాఁడు]
బస్సా—'ఆంటోనియో' సుమీ యావచ్చువాఁడు
షైలా—(తనలో)కంటకు నిటఁ డిచ్చకంబులు పలుకు
సుంకరిగతి నెట్లు మాడ నయ్యెడు నె !
ఇంక ద్వేషించెద నీతని నొక్క
క్రైస్తవుఁ డనునట్టి కారణమున నె ;
విస్తారముగ సొమ్ము వృద్ధిఁ గైకొనక
పరులకు నప్పిచ్చి, వడ్డిక్రమంబు
నరయక చెడఁగొట్టి యవివేకరీతి
మఱియు 'వినీసు'లో మాబోంట్ల కెల్లఁ
దలుగని నష్టంబు తగిలించుఁగాన
రోఁత పుట్టు మఱింత యాతనిఁ జూఁడ.
ఈతని జుట్టొక్క యింత నా చేత
దొరకినఁ జాలును, దొంటి వైరంబు
కరమర్థి సాధింపఁ గలవాఁడ నేను.
మా హానియము లయినట్టి మాజాతి వారి
బహుతర ద్వేషభావంబునఁ గాదు ;
వణిజు లందఱుఁ గూడు పట్టునఁ గూడ
గణన సేయక నన్నుఁ, గడు నేనొనర్చు
బేరంబును, నధర్మవృద్ధియం చొక్క
పేరిడి వ్యవహారవిధమున వచ్చు
న్యాయార్జితంబైన నాదు లాభమును,
దోయను వారిలో దూషించుచుండు.
చేతిలోపల వచ్చి చిక్కినయపుడె
యాతనిఁ గరుణించి యే సైతు నేని,
మా కులంబున కవమానకరంపు
వ్యాకులతలను గూర్చువాఁడ నేనాదు.
బస్సా—వినుచు నున్నావె నేనను చున్న దాని ?
షైలా—ధనమిప్పుడెంత నాదగ్గఱ నియ్యె
నొదవునొ చింతించుచున్నాఁడ మదిని
కదిలంబుగా జ్ఞప్తిఁ బెట్టి యూహింప
మూఁడు వేల్మాడల మొత్తంబు నేను
నేఁడు పూర్ణంబుగా నిమిషంబులోన
నర్పింపఁగాఁ జాల ; నయిన నేమాయె
ఓర్పుతో నడుగ, మా 'యూదుల'

వాఁడైన 'ట్యూబలు' బహుళధనికుండు
నేను తప్పక యిచ్చు నేఁగోరుసొమ్ము..
తాళు మించుక నేఁడు; తగ నెన్ని నెలల
కాలంబువలయును గడువింక మీకు ?
ఘనశుభంబులు నీకుఁ గలుగును గాక!
(ఆంటోనియోతో)
నినుఁగూర్చియే యింతదనుకను నిందు
మాటాడుచున్నాము మాలోన మేము.
ఆంటో—నాఁటి కింత యెవఁడునొక్క-
యొక్కింత
వడ్డిని గైకొని బదు లిచ్చి యుండె,
వడ్డి నూరక యిచ్చి పరులదగ్గఱను
బదులుచేకొనియుండె, పరికించి చూడ
నిదివర కెన్నండును నెఱుఁగను నేను ?
ఐన, మిత్రునిగొప్పయక్కఱఁ దీర్పఁ
బూని వ్రాతభంగమున కొప్పుకొందు
(బస్సానియోతో)
ఈ వెతింగించితె యితనితో నెంత
కావలయునొ సొమ్ము గట్టిగా నీవు ?
షైలా—మఱచితేఁడు నన్ను మూఁడువే
లడిగె
ఆంటో—మూఁడుమాసంబులప్పును
దీర్చ గడువు.
షైలా—మఱచిపోయితి; మూఁడు
మాసము లౌను;
మఱి చెప్పితిరినీరు మంచి దట్లయిన
వంచింపకిపుడింక పత్రంబు వ్రాసి—
కొంచెమాలోచించుకొననిండు నన్ను.
వినవయ్య; యిప్పుడు వృద్ధికి నీవు
ధన మప్పు గొనవని, దాని వడ్డులకు

బదులియ్యనని యుచితి బలికినయట్లు
విదితము గానింత వినిపించెఁ జెవికి
ఆంటో—పని యట్టిదెన్నఁడు నూహింప
లేను,
షైలా—వెనుకటి 'జాకొబు' దన పిన
తండ్రి
యైన 'లేబను' గొఱ్ఱియల మేపునప్పుడు,
(జ్ఞానాఢ్యురాలైన జననిదానతని
పక్షంబువను వంచిపనిచేయుకతన)
దక్షత బావనతనుఁడైన యాబ్ర
హాము' నుండియయినరయఁ దృతీయుఁడైన
స్వామి యయ్యెను గాదె వానికి నెల్ల ?
అవునవు మూఁడనయనుభోక్త యయ్యె,
ఆంటో—అవునాతనిగుఱించి యనియెడి
దేమి ?
అతఁడేమయినవడ్డినెట్టుఁబుచ్చుకొనెనె ?
షైలా—అతఁడు వడ్డి గ్రహింపఁడఁటివి
చూడంగ,
మీయాగ్రహమును బట్టి మేదిని సరిగ
నాయది వడ్డికాదణుమాత్ర మైన.
కనుమేమి జ్యాకబు, కావించినాఁడొ.
మును 'లేబను' దానుదమ్ముతోఁ గలిసి
చిత్రవర్ణంబును జెలఁగు చాఱలును
గాత్రంబునందును గలగొఱ్ఱెపిల్ల
లెల్ల నాకూలికై యియ్యంగఁదనకుఁ
జెల్లెడియేర్పాటు చేసికొన్నప్పుడు,
నేరుపరి యగు నా నెఱగొల్లవాఁడు
చేరి కఱ్ఱలుకొన్ని చిత్రవర్ణంబు
సంభవంబగునట్లు చర్మంబు నొలిచి
సంభోగవేళ మేషంబుల వానిఁ

జూచునట్టుగ నొక్క-చోటను బోఁతె;
చూచి యవ్వాని సురతింపువేళ
మచ్చపిల్లలఁ బెట్టె మతిఁ గొఱ్ఱెలెల్ల;
అచ్చటనవి యెల్ల జాకబు వయ్యె
ఇది యొకమార్గ మీయుల వృద్ధినొందఁ;
పొదలెను దీనఁ బొందె యాతండు.
క్రమ్మిచ్చి గడియింపఁ బూనక యున్న
మెచ్చఁగుఁ బుమ్మి భూమినివృద్ధిగనుట.

ఆంటో—అది యదృష్టముమాత్రమని 'జాకబ్'
పడఁపడి చేసినపని యంతెకాని,
దానిఘటింప నాతని శక్తి లోని
దేవాంశఁ గానేర దింపకయున్న;
దైవంబు దయచేసి తాను సాధింపఁ
గావించెఁ గావునఁ గలిగె వాంఛితము.
అవి వడ్డిమందికి యని చూపుకొనుట
మొనలను మన వేదమునఁ జేర్పఁబడెనె?
కాక, నీ వైనబంగారంబు వెండి
మేకోనఁ బొట్టేళ్ళ మేపాంగవలునె?!

షైలా—అది చెప్పఁజాల నేనంతియు కాని,
వెసవెట్టి యంతటివేగంబులోన
విత్తంబుఁ బిల్లలఁ బెట్టింపఁగలను.
చిత్తగింపుఁడు నేను చెప్పెదుమాట—

ఆంటో—(తమలో) వినుమియామసురంకు వేదంబునుండి
తనపనికిఁ బ్రమాణమును జూపఁగలఁడు.
తనదురాచరణంబు స్థాపించుకొనుటకుఁ
బనిఁగొనుదుఁ బ్రమాణ వచనముల్ సదువు.
కష్టాత్ముఁడు, నగుమొగంబును బూను-
దుష్టుని కఠినిని, దొల్తఁ జూపులకు
బాగుగానుండి, లోపలఁ గుళ్ళినట్టి
లేఁగుఫలము యొక్క రీతిని నుండు,
హా గొరా! పయికెంత యందంబుగాను
ధారుణి గాన్పించు దబ్బఱయొప్పు!

షైలా—మూడులుమూడు వేల్—మంచి మొత్తంబు;
మూడుమాసములొక్క యేడాదిలోన—
బెంచి ఈనెలలకు వడ్డి యెంతగాఁ గలదొ
యేను జూచుకొనుదు నెన్నికవేసి,

ఆంటో—సామ్మునుదయచేసి మముఁ బంపెదవె?

షైలా—నమ్మకచెడె నాధనమ్మునుగూర్చి
వడ్డినిగూర్చియు బలుమాఱు నన్ను
వడ్డసేయక తిట్టె సరివారిలోన.
నవమానపరిచితి వంగళ్ళవాడ.
అవియెల్ల సహియించియడఁగియున్నాఁడ,
శాంతియే యొందు మాజాతివారికిని
గాంతినిచ్చెడి యలంకారంబుగాన,
నాయిష్టమగురీతి నా సొంతసొమ్ము
హాయిగా వాడిక చేయుతప్పునక,
యంతగా 'నాస్తికుఁడా' యంచు మఱియు
గొంతుకలను గోయుకుక్కా! యటంచుఁ
బిలిచి వైచితి వుమ్మి వలువలమీఁద.
బళి! నీకు నిపుడు నావలని తోడ్పాటు
కావలసినయట్టు కానుపించెడును
నీవద్ద వేయేల? నీవు నాకడకుఁ
జనుదెంచి యిటమాకు ధనముకావలయు
నన్నచున్నమతిమతి యడుగుచున్నావు.

వెనుక గడ్డముమీఁద వెస నుమ్మివైచి
చని లోన దూలిన శునకంబునోఁ ద్రోటఁ
దన్నినగతి నన్నుఁ దన్నిననీవె
వెన్నాడి ఋణమియ్య వేఁడుచున్నావు.
ఈయెడ నీకు నేనేమి యుత్తరము
నీయంగవలయును ? 'ఓయి' యెంతైన
శునకంబునొద్దను సొమ్ముండునయ్య ?
పనికిమాలినకుక్క బదులుగా మూఁడు
వేలమాడల నియ్యఁజాలునె ? యంచు
లీల నేఁబలుకంగఁ బోలదే యిపుడు ?
ఏను నీకడ వంగి భృత్యస్వరావమున
రానీక యూపిరి నైన బిగ్గరగ !
వినయంబుతోఁప మెల్లనివాక్యములను
'ఘనపుణ్య ! బుధవారమున మొన్న మీర
లొక్కతేప నామీఁద నుమ్మివైచితిరి ;
ఒకనాఁడు తన్నితి రూరకనన్ను ;
మఱియొక్క దినమున మన్నించి నన్నుఁ
బ్రతికికుక్క యటంచుఁ బిలిచినవారు ;
మీరుచేసిన యిట్టిగౌరవాధిక్య
కారణంబుననియ్యఁగలవాఁడ ఋణము
నని చెప్పుదునె నేను హర్షంబుతోఁడ ?
ఆంటో — నినునిప్పుడును గూడ నే
నట్లె పిలిచి,
తిన్నగాఁ బయినుమ్మి తిరుగంగ వైచి,
తన్నను గూడను దన్నంగవలయు.
ఇయ్యెడ నాకప్పు నిచ్చెద వేని,
నెయ్యునకిచ్చినట్లియ్యంగఁ బోకు ;
ఏలయన్నను. నెప్పు డెవ్వఁడు సఖుని
పాలను సొమ్మిచ్చి వడ్డిగైకొనెను ?
అదికాన, నీవిప్పు డరికిచ్చినట్లె
బదులిమ్ము వానికి ; పలికినయట్టి
మాటతప్పితివేని. ఎఱియు నిర్దయత
పాటించి గైకొనవచ్చు దండుగను.
షైలా — ఇంతలోవచ్చె నీకెంతకోపంబొ!
ఎంతకుం నీతోడ నెపుడు నేస్నేహంబు
కావించుకొని, నీదు కరుణయుఁ బడసి.
నీవొనర్చినయట్టినికృతుల మఱచి,
యిప్పుడు నీయక్కఱ కెల్లను దీర్చి,
గవ్వయు వడ్డిని గైకొనకుండ
ధనము నీకప్పియ్యఁ దలఁచినవాఁడ ?
వినవు నామాటలు కొనముట్టనీవు ;
దయఁబూనియే యియ్యఁదలఁపుగొన్నాఁడ.
బసా — దయచేసె యనవగు ధనమిత్తువేని.
షైలా — ఈయుపకారంబు నేఁజేయువాఁడ
న్యాయవాదికడకు నావెంటవచ్చి,
'గడువునాఁటికి సొమ్ము కడతేఱనీని
యెడలను, నేను నాయొడలియందుండి
సేరుమాంసంబును శీఘ్రంబ నీవు
కోరినచోటను గోసియియ్యంగఁ
గలవాఁడ'నని యొక్క గడువుపత్రంబు
బలువినోదార్థంబు వ్రాసి, చేవ్రాలు
చేసియాతండు వీక్షింపుచునుండ
వేసి నీముద్రను వేగ నాకిమ్ము.
ఆంటో — ఇంతటితోడ నీవిఁకఁ దృప్తి
నొందు
సంతకమొనరించి సరిగఁ బత్రమును,
కలదు 'యూదు'నికిని గనికరమందుఁ
బలుకంగఁ గలవాఁడ బహుముఖంబులను.
బసా — న్యాయంబుగానీవు నానిమిత్తంబు
వ్రాయకు మటువంటి పత్రంబు నెప్పుడు ;

ఇట్టిపత్రమున కేమికొంటకంటె
నట్టె గుండెవ నున్న నట్టియూస్థితినే.
 ఆంటో—మిత్రుఁడ! భయ మెంతమాత్రంబుపడకు?
పత్రంబులోపల వ్రాసినయట్టి
గడువుదాఁటకనియ్యఁగలవాఁడఁగాను.
ఇఁకయు రెండుమాసంబులలోన
(మనపెట్టుమితి కొక్కమాసంబునుండె)
తనుదెంచు నోడ లిచ్చటికిని నావి
మునమొత్తనికి నియ్యఁ జను సొమ్ముకంటె
వినుము తొమ్మిదిరెట్లు విత్తంబుతోడ.
 షై—ఏమి! యీ 'క్రైస్తవు' లెంతటివారు!
తా మితరులతోడఁ దగఁజేయునట్టి
వ్యవహారములనెంచి, పరులపైఁగూడ
మిగుల సంశయమున మెలఁగుచుండుదురు.
దయచేసి దీనికుత్తర మిమ్ము సామ!
పయినన్నమితికిలోపల సొమ్మితండు
చెల్లింప లేకున్న, నేను నాంతంబు
వల్లపత్రముఁబట్టి యదిమి కైకొన్న,
లాభంబు నాకేమి లభియింపఁగలదు!
ఈభువి నరమాంస మెంచిచూడంగ
గొఱియల మేఁకల గొడ్లలో వేని
రొంటికి వెలయందు నెనరాకయుండు;
ధర నంత యుపయోగకరమును గాదు.
కరము నీతనిమైత్రి గడియించుకొనఁగ
నుపకార మిది చేయ నొప్పుకొన్నాఁడ.
ఇపుడిష్టముండి తా నీతండు దాని
నంగీకరించిన నదియెంత మేలు;
అంగీకరింపఁడే నటులున్న మేలు?
దానునగ్రహమెంచి, నాకేమికీడు
చేయకుండఁగ మీరుఁ జేయుదునతని.
 ఆంటో—నీకొసంగబడికను నేఁగోసియిత్తు
 షైలా—ఈకొందువేని నీవిటు వ్రాసి యియ్యుము.
న్యాయవాదికడకు నడిచి పత్రమున
వ్రాయుపద్ధతి నీవు వ్రాయుచుండుము?
చని నేను మాడలు సంచిలో వేసి,
ధనమును దుర్వ్యయ మొనరింపఁజాలు
పలుగుభృత్యునియొక్క వశమున నున్న
యిలు చూచుకొనివత్తు నీనిమిషంబె.
 ఆంటో—త్వరితముగా రమ్ము తగువాఁడ వీవు. [షైలా వెళ్ళును.]
కరుణాళుఁడయ్యెడుఁ గరమునుతఁడు;
ఈ 'యూదుఁ' డగుఁజుమీ యికఁ గ్రైస్తవుఁడుగ.
 బస్సా—తీయనిపలుకులుఁ దొక్కలిమనసుఁ
గలవారినెంతయు గర్హింతు నేను.
 ఆంటో—అనుకొంద వలసిన యక్కఱలేదు;
నడతెమ్ము పోదము; నాయోడలెల్ల
గడువుకొక నెలయుండఁగనె యిల్లుచేరు.
 (అందఱు నిష్క్రమించిరి.)

## ద్వితీయాంకము.

—:o:—

౧. రంగము—బెల్మంటుపురము. పోర్షియ గృహములోని గది.

వాద్యములు మ్రోయఁగా తనపరివారములతో మొరాకొ రాజకుమారుఁడును,

చెరిచారవలనోఁగూడ పోర్ష్యయును,
సెరిస్సాయును, ప్రవేశించుచున్నారు.]

మెహరా—కరముదగ్గఱనుండి చెరిగిపకతన
ఖరకిరణుఁడు నాపైఁ గరుణించినట్టి
నీలాంబరంబుల నెగడునా మేని
నీలిడాలును జూచి నెలఁతరో! నన్ను
నేవగింపఁగఁబోకు మిందుకయేని.
కేవలమును సూర్యకిరణాగ్ని సోకి
మండుగడ్డలను గరంచఁగాలేని
మంచియుత్తరభూమి మఱిపుట్టినట్టి
కడునందగాని నాకన్నను దెచ్చి
వడిగ నీప్రేమంబు బయలఁబడంగ
గంటులొనర్ప మాకాయంబునందు
బంటుతనముఁ దెల్పు బహుశోణరక్త
మెవ్వనిలోపల నెసఁగియుండెడునో
యివ్వడినందఱి కెఱుఁగంగ నగును
ఎఱిఁగింతు వినుము నాయీరూపెనున్న
వెఱపు పుట్టించెను వీరుల మదికి;
వాక్రొనియెద గొప్పబాసను జేసి
నాకూర్మిసాక్షిగ, నలినాయతాక్షి!
మాసీమఁ గలయట్టి మగువలందెల్ల
వాసికెక్కినరూపవతు లెల్లవారు
నీరూపమునకె మోహింత్రువన్న.
ఈరంగు మార్చుకో నేనిచ్చగింప
నీరజాక్షీమణి! నీమానసమును
గోరి వరియించెడికోరుకఁ గాదేని.

పోర్ష్య—కన్నెనయ్యెవరించుకార్య
మందొకక్కె—
కన్నులచేతనే ఘనవివేకంబు
నడల. నేనడపంగఁబడుదానఁగాను:
అదిగాక నియతియొం డడ్డముండుటను
వరునిస్వేచ్ఛఁగ గోర నల్లగాకుండు.
అరయ నింతకుమున్దె యువులమీతోడ
విన్నవించినయట్టివిధముగా నెవఁడు
నన్ను సాధించునో యున్నరాగ్రణికి
నేనుభార్యనుగాఁగ నిర్బంధమొకటి
పూనినాజనకుండు బుద్ధిపెంపునను
గావింపఁజేసియు, ఘనకీర్తిధామ,
నీవును నను గోరి నేఁటిదనుకను
వచ్చియుండిన యెల్లవారలవలెనె
హెచ్చుచక్కనివాఁడవే యయియుందు
విందునాదృష్టికి, నిదినిశ్చయంబు.

మెహరా—అందునకును మ్రొక్కులర్పింతు
నీకు;
కరుణించి పెట్టెలకడకును నన్ను
సరగునఁ గొనిపొమ్ము; చని నాయదృష్ట
మెటులుండునో యత్నమేఁ జేసిచూతు.
ఇటమున్ను ముమ్మాఱు లెదిరించి పోరి
'సాలిమా' ననఁగను జనెడి సుల్తాను
నాలంబులో గెల్చినట్టియా 'పార
సీక' రాజును, బుక్రి, జెండాడినట్టి
యాకత్తితోడు, నేనెటువంటిక్రూర
దృష్టివానిని మించి తేఱిమాచెదను;
సృష్టిలోపలనెల్ల స్థిరధైర్యశాలి
యైనవానిని మింతు నతిధైర్యగరిమ;
ఈనినప్పుడు తల్లియెదురఁ బాల్ద్రావు
నెలుఁగుపిల్లలనెల్ల నీడ్చితెత్తు;
బలమయినయాకటఁ బటుగర్జనంబు
నొసరించుసింహంబు నొగివెక్కిరింతు
వనితరో! నిను గెల్చుకొనియెదుకొఱకు.

అటకటా! చింతింతుఁ గాలవక్రతకు.
పటుసమర్థుఁడెవఁడో పరికింపుమకటా
యజమానుఁడైనట్టియుల్ల 'హార్క్యులెసు'
నిజసేవకుండయి నెగడు 'లిచాసుఁ'
గలిసిజూదము నాడఁగను దైవికముగ
బలహీనునికి పెద్దపందెంబు భువిని
బడవచ్చుఁ బాచికల్ పట్టివేయంగ.
ఒడిచె 'హార్క్యులెసు' నె యొకసారితొల్లి
సరిగ సేవకుఁ డట్టి చందంబుగానె.
అరయ నేనును నట్టి యంధమైనట్టి
భాగ్యంబుచే నడపంగను బడుదు
భాగ్యపేటిక నయోగ్యున కట్టె విడిచి
వెసఁబోయి యొకతప్పుపెట్టెను గోరి
వ్యసనాతిశయతఁ జావంగనువచ్చు.

పోర్ష్య—భారమదృష్టంబుపయి వైచి నీవు
కోరఁ బ్రయత్నింపఁ గూడదు మొదల;
అటుగాక కోర నేయత్నింతువేని,
యట కేగి పెట్టియ నంటకమున్న
తప్పుపెట్టెను గోరి తాఁకిన యెడల
నెప్పుడు నీకమీఁద నేయింతితోడ
మఱి వివాహమును గూర్చి మాటాడనంచు
మఱి విప్రమాణంబు నొనరింపవలయు
కావునఁ బరికించి కార్యంబు గనుము.

మొరా—ఏవెలందిని నింక నేఁ గోరఁబోను;
వచ్చి పెట్టెలఁ గనఁబడుపుము నాకు.

పోర్ష్య—క్రచ్చరదేవతాగారంబునకును
ముందుగాఁ బోవలె; భుజియించి వెనుక
నిందుఁ బెట్టెలఁజూచి యేర్చుకోవచ్చు.

మొరా—ఓయదృష్టమ! మానవోమంబు
జేయుదువో ధన్యశేఖరుఁ గాఁగ
నవరింతువో లేక జనులలో నెల్లఁ
గనరాని మందభాగ్యునిగాఁగ నన్ను!
(వాద్యములు మ్రోయ వెళ్ళుచున్నారు.)



౨. రంగము—వినీసు నగరములో
నొకవీథి.

[లాంసిలాటు ప్రవేశించుచున్నాఁడు]

లాంసి—నాయంతరాత్మయు నాస్వామి
యైన
యీ యూదు కడనుండి యెటకైనఁ బాఱి
పోవనొప్పును 'గ్రొస్తవుఁడ' నొట నేను
యీపలను బిశాచమిప్పుడే చేరి
సరసను జేరి 'యో సర్వోత్తముండ!
సరగున లేచి, నీచరణంబులకును
బనిపెట్టి, దవ్వుగఁ బరుగిడు మనును.
'పనిచెడు; వలదది పాడిగాదయ్య;
భద్రము! కాలెత్తి పఱచుట యన్న
తుద్రవుఁబనిగాఁగఁ జూడుకో' మ్మనుచుఁ
బలుకుచున్నది తేటపడ నంతరాత్మ.
తలఁపఁ దంపరియైన దయ్యంబు మాట
గట్టును ; పయనంబుగమ్మ్ము ; లేలెమ్ము ;
దిట్టతనముప్రాను దృఢముగామదిని,
పాఱిపొమ్మని నన్ను బనుపుచున్నయది.
మీఱి డెందమున మెడ కౌఁగిలించి
తద్దయుఁ బుద్ధిగాఁ దానంతరాత్మ
'పెద్దమనుష్యుఁడా! పెద్దమనుష్య
తనయుండవైయుండి తప్పకనీతి
ననుచును గడు నాకు న్యాయంబు చెప్పు;
నందుఁ దొలుతను నాతండ్రి దొంగిలుటందు

వలవాటుచేఁ గొంత యభిరుచిగలుగు
వాఁడౌట, నను 'నయవంతుఁ డైన
యూఁదుఁడానితఁడుఁడ'న్న బాగుంకు
'అనుగంగవలదయ్యా' యనునంతరాత్మ ;
'అనుగుము శ్రీఘ్రంబ' యనుఁబిశాచంబు ;
'అనుగంగవలదయ్యా' యనునంతరాత్మ.
సరసంబుగా నీవు సహోర్బధ నాదు
నొనరించెదవు చాల నోయంతరాత్మ !
ఒనరించెదవు నీవు నోపిశాచంబ.
మంచిబోధనెనాకు మాటిమాటికిని.
వంచనలేక నేవడి నంతరాత్మ
చెప్పినరీతినె చేయుదు నేని,
తప్పక యొకరీతిదయ్యంబువంటి
'యూదు'నియొద్దనె యుండంగలయు ;
'యూదు'నికడనుండి యుఱుకుదు నేని,
తలఁపఁ గేవలమును దయ్యమే యైన
యాలపిశాచముమాట వలయుఁ జెల్లింప.
అ'య్యూదుఁ'డు, వినిశ్చయంబుగ నల్ల
దయ్యంబునపరావతారం బె సుమ్మ.
కఠినత్వము వహించి కను నంతరాత్మ
శత్రుఁడైన 'యూదు'ని సరసను నిలువఁ
బనుచుచున్నది మనోవ్యథ హెచ్చ నన్ను.
మనసున కింపుగా మంచియోచనను
జెప్పెను బిశాచ మిప్పుడు మిగుల.
తప్పక పరుగెత్తెదను, బిశాచంబ !
నీయగునాజ్ఞలో నిలిపితి నాదు
పాదద్వయము, నింకఁ బాఱిపోయెదను.
[ఒకగంప పట్టుకొని వృద్ధుఁడైన 'గాబో', ప్రవేశించుచున్నాఁడు.];
గాబో—ఓయయ్యగారు ! వే'యూదుని,
కేయది త్రోవయో యెఱిఁగింపరయ్య.
లాంసి—(తనలో)ఆహా ! నాకన్న
యయ్యరో యితఁడు.
ఊహింప నరగుడ్డి నొక్కింత మించి,
నను నానవాలిడఁగను లేనికతనఁ
గొనవచ్చు ముప్పావుగుడ్డిగా నితని.
ఇప్పుడు క్షణమాత్రమీతనితోడ
గొప్పవినోదంబు గొలుప భాషింతు.
గాబో—ఓయయ్య ! దయచేసియూదుని
యింటి
కేయది త్రోవయోయెఱిఁగింపుమయ్య.
లాంసి—మొదటిమలుపులోనుముఖ్యంబు
గాను
వదలక కుడిచేతివైపునఁ దిరుగు ;
తరువాయిమలుపులోఁ దప్పకుండంగఁ
దిరుగు మెడమచేతిదిక్కునకీవు ;
ఆవలిమలుపులో నల 'మేరి, యాన,.
యేవంకకును మళ్ళ కేగుము నీవు
'యూదుని,యింటికే యోరగా నడిచి.
గాబో—ఈదారి తెలియుట, యీశ్వరు
తోడు.
కరముకష్టంబుగఁ గాన్పించుదారి.
పరిచరుఁడయి 'యూదు,పజ్జను నున్న
యల 'లాకసిలా'బిప్పుడం దెయున్నాఁడో
కొలువేది యటలేఁడో తెలుపంగఁగలరా?'
లాంసి—మాటాడుచున్నావె మతిచిన్న
'లాంసి
లాటు, గారినిగూర్చి మేటిపృద్ధుండ ?
(తనలో) చూడు మేనిప్పుడు సొగసు
గా నితని.
యింటి నేడిపించెద నొక్కనిమిషంబులోన.

(ప్రకాశముగా)

మాటాడుచున్నావె మఱి చిన్న 'లాంసి
లాటు' గారినిగూర్చి మేటి వృద్ధుండ?

గాబో—గారు గీరును లేదు; కడుబీదవాని
కూరిమిపుత్త్రుండు; గొప్పగ నేనె
యడిగె చెప్పుచున్నను, నాతనితండ్రి
దైవంబుకృపచేతఁ దగుచందమునను
జీవించుటకుఁ జాలు స్థితిగలవాఁడు.

లాంసి—కానిమ్ము జనకునిగతియెట్టిదైన,
పూనియిందు మనమిప్పుడు చిన్న 'లాంసి
లాటు' గారినిగూర్చి మాటలాడెదము.

గాబో—మేటిమిత్త్రుండు స్వామికి 'లాంసిలాటు'.

లాంసి—అవునందుచేత నే, ప్రార్థింతు నిన్ను,
వివరంబుగా, నోయి వృద్ధుండ! 'లాంసి
లాటు గారినిగూర్చి మాటాడెదవయ్య?

గాబో—మాటాడుదును 'లాంసిలాటు' గుఱించి,
కరుణించి మీర లుత్తర మిత్తురేని.

లాంసి—సరి! లాంసిలాటు గారయంగ నతఁడు
మాటాడఁబోకయ్య, మాతండ్రి! లాంసి
లాటు గారినిగూర్చి లౌల్యంబుతోఁప
ప్రేల యనెదవేని. యెఱిఁగింతు వినుము—
బాలుఁ డాయన (విధి వ్రాఁతలఁబట్టి
గ్రహచారములఁబట్టి, సహజలౌ త్రివిధ
బహుచిత్రభాగ్యదేవతలను బట్టి,
జ్యోతిషావ్యర్థశాస్త్రంబులఁ బట్టి,
జాతకములఁబట్టి చచ్చినవాఁడు ;
వినుదానియర్థంబువిప్పిచెప్పెదను—
చని యాతఁడదె స్వర్గమునను న్నవాఁడు.

గాబో—హా! దైవమ! ముదిమి నా బాలకుండు
నాదగు వెనుప్రాపు ; నాయూతకోల.

లాంసి—నేను స్తంభమువలె నిట్రాడి వలెను
గనఁబడుచున్నానె కనుఁగొనవీవు ?
నను నెఱుంగుదువయ్య, నాకన్నతండ్రి ?

గాబో—దినమహిమంబు నేమనియందు నకట!
నిను నే నెఱుఁగనయ్య; నిజము, కుమార!
అగుఁగాక రక్షణ మతనియాత్మకును!
తగ నెఱింగింపుము దయచేసి, వాఁడు
మరణంబునొందెనో మనియున్నవాఁడొ?

లాంసి—అరసి నన్నెఱిఁగితివయ్య, యో తండ్రి?

గాబో—అక్కటా! వినుము నే నరగుడ్డివాఁడ ;
నిక్కముగా నయ్య నిన్ను నే నెఱుఁగ.

లాంసి—నీకు నేత్రములున్న, నిజముగా నెఱుఁగ
లేకయేపోవచ్చు లెమ్మన్నీవు
తన కన్నకొడుకును దాఁ గనుంగొనెడు
జనకుండు ఘనబుద్ధిశాలి గావలయు.
ఓ పెద్దవాఁడ నీకో పిక పెట్టి
నీపుత్త్రువార్తలు నేను దెలిపెదను.
దీవింపుమోయయ్య! నీవు నన్నిపుడు,
భావింపసత్యంబు బయలను బడును.

తోఁటయునిపుట్టానికి బోఁగంగ వచ్చు
మనలోన నరహత్య మతిదాఁగ దెపుడు;
నిలుకడవిూఁదను నిజ మెందు దెలియు
(వెనుక తిరిగి పోకరించుచున్నాఁడు.)
గాబో—నిలుమయ్య, వేడెద నిన్ను నే
నిపుడు;
వివర మెఱుంగుదు వినుము నాపుత్రుఁ
డవునట్టి 'లాంసిలాటు'వు గావు నీవు
లాంసి—నిను వేఁడుకొనియెద, మనమింక
ముందు
పనికిమాలిన పిచ్చిపనులు మనేమి
యీవిషయంబునఁ గావింపవలదు;
దీవన లీవయ్య తిన్నఁగా నాకు
ఇప్పుడుఁ బూర్వంబు నీకముందు గూడఁ
దప్పకుండఁగ నీదు తనుజుండనైన
'లాంసిలాటు'నె సుమ్ము లక్షింప నేను.
గాబో—హింసపెట్టకుమన్ను; నేనించు
కేని
నమ్మఁజాలను నీవు నాపట్టివనుచు.
లాంసి—అమ్మఁడిక్రొఁ జెప్పఁగ, నందును
గూర్చి
యేమియూహించుట కెఱుఁగను నేను;
నామము 'లాంసిలాటే' మహి నాది;
'యూదుని' భృత్యుఁడ నౌదును నేను
నీకుభార్యయగు మ మేదినిలోనఁ
దనరెడు 'మార్గరీ' యను నామె కేను
దనయుండనౌదును దథ్యంబుగాను
గాబో—మహి నామె నామంబు మార్గరీ
నిజము.
అహా! 'లాంసిలాటు వే' యగుదేని నీవు,
నా రక్తమును మాంస మౌర నీవగుదు
సైరింప వాతఁ డీశ్వరుఁ గొల్వఁ గాత!
ఎంతగడ్డము నీకు నిపుడున్నదార!
పలితముగా నాదు పంచెపుగుఱ్ఱ
మైన 'డాబిను' తోఁకయందు నున్నట్టి
దానికంటెను జాల దట్టంబుగాను
గలవు వెంట్రుకలు నీగడ్డంబునందె.
లాంసి—తలఁకు నేట్లగుచేసి, తప్పకుండంగ
వెనుకవైపునకు 'డాబిను' తోఁక పెరుగు
చునున్న నట్లుగఁ గనుపట్టవలయు.
కడసారి నేదానిఁ గాంచినయపుడు
పడికి్రిందికెని నాదు వదనంబుకంటె.
వినుదానితోఁకకె విస్తారముగను
గనఁబడినవి వెంట్రుకలు నిశ్చయముగ.
గాబో—ఓయి! యెంతగ మారిపోయి
నావీవు!
నీయజమానుఁడు నీవును నింత
యిష్టంబుగా మీర లిపుడున్నవారె?
తుష్టికై యతనికిఁ దొలుత నర్పింపఁ
గనుగానుకొక్కటి కొనివచ్చినాఁడ.
కనియిప్పు డెట్లొప్పుకొనెదవు నీవు?
లాంసి—సరి! సరి! నేఁగొల్వఁ జాలించు
కొనుచుఁ
బలుగిడ నిశ్చయపఱచుకొన్నాఁడఁ
గావున నెక్కడ గంతిదు దాఁక
నేవలనను నిల్చియేకుండఁ జాల.
తాను కేవల 'యూదుఁ' డౌను నాస్వామి.
వానికి కానుక పెట్టుట కూడ!
ఉరిత్రాఁడు వానికి నొకదానినిమ్ము.
మఱిగి యాతని సేవ మలమల మాడి

తూలికాతల్పములోన నుండొకటి ;
క్రాలునిద్రపట్టఁ జెలుగండమునే మూదు.
మహి భాగ్యదేవత మగువరో యైన,
బహుసౌభాగ్యరాశౌను బరఁగనాకిన్ని
ఘనమైన మేళ్ళను గలిగించుకతన.
తను దెప్ప వేసెడుకాలంబులోన
'యూదు'నికడ కేగి యుత్తరువొంది
సాదరముగ వత్తు; జనకుండ ! రమ్ము.
(లాంసిలాటును, గాబోయును వెళ్లు
చున్నారు.)
బస్సా—ఓయి'లియోనార్డు'! చేకొను
దీని.
ఈ కొడ వలసినయెల్ల వస్తువులఁ
గొనియింట నొప్పగింతను బెట్టిపరిగఁ
జనుదెమ్ము క్రిమ్మఱ సరగను నీవు ;
ఈరాత్రి విందు చేయింతును నేను
గూరిమిచెలులకు ; గొబ్బునఁబొమ్ము.
లియో—ఈవిషయంబున నెల్ల యత్నములఁ
గావింతు నాశక్తి గలవంతవట్టు.
[గ్రేషియానో ప్రవేశించుచున్నాఁడు,]
గ్రేషి—ఎచ్చట నున్నవాఁడిపుడు నీ
ప్రభువు ?
లియో—అచ్చోట దవ్వుల నరుగుచు
చున్నాఁడు.
(లియోనార్డో వెళ్ళుచున్నాఁడు.)
గ్రేషి—ఓయి'బస్సానియో' యోచెలి
కాఁడ !
బస్సా—ఓయి ! వచ్చితివయ్య ? యో
'గ్రేషియానో'

గ్రేషి—చేయుదు నీకొక్క చిన్నవిన్న
పము.
బస్సా—చేయకుండనె దానిఁ జెల్లించి
నాఁడ.
గ్రేషి—నీవు నారాక ను నిజముగా నిప్పు
డావంతయును నడ్డమాడంగవలదు ;
నీతోడ 'బెల్మంటు' నేను రావలయు.
బస్సా—నాతోడ రావచ్చు నాయడ్డు లేదు
కాని, యెప్పటిమోటుగా నుండుటీవు ;
కానిపింతు వడవిమానిసివలెను ;
వెనుకముం దరయక వినుమెల్లయెడల
మనసువచ్చినయట్లు మాటాడెదీవు.
హైవికంబుగ నీకుఁ దగియున్న యట్టి
నీవైనగుణములు మావంటివారి
కన్నులకును దప్పుగాఁ గానఁబడవు ;
నిన్నెఱుంగనిపట్ల నిజముగా నవియె
యతి దూష్యములు గాఁగ నగపించుఁ
జూమ్మీ.
బతిమాలెదను గష్టపడి యెట్టులైన,
నణఁగి యుండని త్వదీయస్వభావంబు
నణఁకువ యను శీతలాంబుబిందువుల
చేత శాంతినిబొందఁ జేయుము నీవు ;
ఏతెంచి నాతోడ నిటు సేయకున్న,
నీవెఱ్ఱినడతచే నేఁబోవునట్టి
తావున నను దప్పఁ దలఁపంగ వచ్చు ;
దాన నాశాభంగమై నేను బూను
పూనికంతయుఁ జెడి పోవంగవచ్చు.
గ్రేషి—ఓయి'బస్సానియో' యొక్కటి
వినుము.

వేయేల ? నేను గంభీరంబుగాను
గనువారికిని బైకిఁ గన్పడకున్న,
ఘనగౌరవముతోఁ బంగాఁ బల్కకున్న:
పెక్కు ప్రమాణముల్ విసువకయున్న,
చొక్కాయి జేబులో స్తోత్రపుస్తకము
లమరించి శాంతాత్ము నట్లుండకున్న,
తమిమీఱ నీశ్వరు ధ్యానించువేళఁ
గనులను టోపితోఁ గప్పి ట్టూర్పు
లనుబుచ్చి 'ఓం. తత్స' తనకుండనున్న,
తనకుముత్తవ్వను దనియించుకొఱకుఁ
బలికెడి గంభీర భావంబుఁ బూన
నలవడ్డ పురుషునివలె, నాగరికతఁ
దెలిపెడి యాచారముల నెల్ల నేను
జన్నుగా ననుసరియోగ పఱుపకయున్న,
నన్నింక నెప్పుడు నమ్మబోకయ్యా.
బస్సా—కానిమ్ము నీ వాలకము జూడఁ
గలము.
గ్రేషి—కాని యీరాత్రి నేఁ గావింపనట్లు;
ఈ రేయి మన చేయు నెద్దానివలన
మీరు నా చేష్టల మెచ్చన్నరాదు.
బస్సా—అయ్యయ్యో యీరాత్రి యటు
సేయవలదు.
నెయ్యురు పలువుంద్రు నేఁడు వేడుకను
గనుటకై యిచటకుఁ జనుదెంతురు గాన,
నిను వేడుకొనియెద నీయిష్టమైన
యంతయుత్సాహంబు నటఁ దెచ్చుకొనఁగ.
ఎంతయు నీకు మేలెనయును గాక!
పనియున్న దిప్పుడు చనియెద నేను,
[గ్రేషి—మనమున్న 'లోరెంజో' మొదలు

గనుగొన నేను నేఁగఁ గనుతలఁతు;
మనకడెంతు మేము భోజనవేళ రాత్రి.
[అనఁదఱు వెళ్లుచున్నారు.]

3. రంగము—వినీసు నగరము ; షైలాకు గృహములోని గది.

[జెస్సికాయును, లాంసిలాటును ప్రవేశించుచున్నారు.]

జెస్సి—వినువాఁడనని నీవు విడిచి వెళ్ళుటకు
మనమున సంతాపమైన నెడునాకు.
మాయిల్లు నరకంబు మహిమీఁద నాకు ;
నాయింట నవ్వించునట్టి దయ్యంబు
వగుచును నీవుండి యాయాసభరము
నొగిఁ గొంత హరియింపుచుంటివి నీవు.
ఇదిగో నీకొక మాడ యిచ్చెద నేను;
ముదమొదవును గాక ముందట నీకు !
ఔనోయి! నీకొత్త యజమానునింటఁ
దానల్ల 'లోరెంజో' తగ నేఁటిరాత్రి
భోజనమునకు బోవును గాన
నీ జాబుఁ గొనిపోయి యావు శీఘ్రంబ
యాతనికి నిరహస్యంబుగ నిమ్ము;
ఈ తీరునను నేను నీతోడ మాట
లాడుట నాతండ్రి చూడంగదగదు;
తోడనె యటుగాన తొలఁగి పొమ్మీవు.
లాంసి—కన్నియరో ! యాజ్ఞ గైకొందు
నేను.
కన్నీరు నాలుకఁ గదలుపనీదు.
ఓసుందరీమణి! యోనారిమిన్న!
మోసంబు నటియించి ముందు క్రైస్తవుఁడు
డైనవారి నిన్నుఁ గైకొనకున్న, నే వెలియాదు.

తన్నుఁ బంపుము; నాదుకన్నెచెవియందు
ముంచె నాఘనధైర్యమును మొదలంట.
మంచిది! సెలవిమ్ము; మతిపోయినవత్తు.
జెస్సి—నీకు మేలగుఁగాక! నీ వేగవచ్చు.
[లాంసి వెళ్ళును.]
(తనలో) నాకొంతపాపంబో నాతండ్రికేను
తనయనంచును జెప్పుకొన సిగ్గుపడెద.
జననంబుచేత నాతనికూఁతు నైన,
గుణములచేతను గూఁతురఁ గాను.
ఘనుఁడ! 'లోరెంజో' వాగ్దానంబు నీవు
చెల్లింతువేని, నాయుల్లములోన
నల్లనపోరాట మంతంబు చేసి,
'క్రైస్తవు'రాలనై ఘనమోహాభరము
విస్తరింపఁగ నీదుప్రియభార్య నౌదు.
(నిష్క్రమించెను.)

—:o:—

౪. రంగము—వెనీసునగరము, ఒకవీధి.
[గ్రేషియానో, లోరెంజో, సాలారినో,
సోలానియో ప్రవేశించుచున్నారు.]
లోరెం—మేము భోజనవేళ మెల్లఁగా జాఱి
మామందిరంబున మాఱువేషముల
ధరియించి, సర్వంబుఁ దగ గంటలోనఁ
బరిపూర్తి గావించి మరల వచ్చెదము.
గ్రేషి—మనము చేయఁగ లేదు నుంచి యత్నమును.
సాలా—మనమింతవఱకును మాటాడలేదు
వచ్చికాగడఁ బట్టువారలనైన.
హెచ్చరికను ముందె యెల్లకార్యములు
సన్నాహమొనరించి నడిపినదక్క,
తిన్నఁగా నుండదు! మనకిట్టిపనికి
బూనుకొనుటకంటెఁ బోవ కాకంటె
మానుటమేలు సామతమునుబట్టి.
నాలుగుగంట లైనది; సిద్ధపడఁగ
గాలమింక నురెండుగంటలుగలదు.
[ఒకలేఖ చేతఁబట్టుకొని లాంసిలాటు
ప్రవేశించుచున్నాఁడు.]
ఉన్నవె యెదవార్తలో 'లాంసిలాటు'?
లాంసి—మన్నించి యిదివిప్పి మతివిప్పి చూడఁ
దెలియఁగంగఁబడు నని యెంచెద నేను.
లోరెం—ఎఱుఁగుదునీవ్రాఁత యెవరిదో నేను?
సత్యము గానిది చక్కనివ్రాఁత.
అత్యంతధవళిమ నలరారు జుమ్మి
త్రాణమై నీ కాగితంబునకన్న
దీని వ్రాసినసారిదేహంబుకాంతి.
గ్రేషి—వలపుసందేశముల్ వాస్తవంబు గను.
లాంసి—సెలవు నాకనుదయచేసెదరయ్య?
లోరెం—ఎక్కడికేగెద విప్పుడు నీవు?
లాంసి—నిక్కము నాతొంటి నేతయైనట్టి
'యూదుని'విందున కొప్పించి రాత్రి
యాదట నాకొత్త యజమానునింటి
కిని బిల్వ నేఁగఁగ జనుచున్నవాఁడ.
లోరెం—కొనుము దీనిని, మచ్చుకొమ్మిదె నీవు. (సొమ్మిచ్చును.)
తప్పక యామెపై దయతప్ప వనుచుఁ
జెప్పుము నాప్రియ 'జెస్సికా'తోడ;

తిరిగి చెప్పెద రహస్యంబుగ నీవి.

(లాంసి వెళ్ళెను.)

పరమాప్తులార! మాపటికి మీరెల్ల
సఖునియింటను నేఁడు జరుగు పంక్తిఁ గడు
ముఖములు ముసుఁగులు పూనివర్తింప,
వలయు ప్రయత్నముల్ సలుపుదురయ్యా?
కలఁడు వాఁడొక్కఁడు కాగడా వాఁడు.

సాలా— నడ నొండిన్నఁ గను గాగడ వాని కొఱకై.

సోలా— వడిగ నేనును బోయి వత్తు వాపనికై.

లోరెం— అరగడియకు 'గ్రేషియానో' ను నన్ను
మరల నీతనియింట మఱికూడుకొనుఁడు.

సాలా— మంచిది మేమట్లె మరలఁగూడెదము.

(సాలారినో, సోలానియో, వెళ్ళుచున్నారు.)

గ్రేషి— పంచెనె యిప్పు డీపత్రిక నీకుఁ
బ్రియురాలు 'జెస్సికా', ప్రేమమీరంగ?

లోరెం— ప్రియుఁడ! నీకంతయు వినిపింపవలయును,
తనతండ్రి మందిరంబుననుండి తన్నుఁ
గొనిపోవ నెట్లు చేయుదునో నాఁడు,
తనవెంటఁ గొనితేరఁ దానెన్ని నగలుఁ
గనకంబు సిద్ధము గావించినదియొ,
తామాలి వేషంబు ధరియించుకొనుటకు
నేమాడ్కిఁ గూర్చెనో భృత్యవస్త్రములు,
నాయుత్తరంబున నన్నియుఁ జెప్పె.
[illegible] 'యూదుండు'
సుగతిఁ బొందఁగ శక్తుఁడగు నేని, సాధ్వి
యగుకూఁతుఁ బట్టియే యగు నిశ్చయముగ;
పతితుఁడౌ 'యూదు'నీసుత యనునెపము
కతనఁ దక్కఁగ నన్యకారణంబునను,
దురదృష్టమెప్పుడుఁ దొయ్యలికాలి
సరపకైనఁ దెగించి చనుదేరకుండు.
చనుదెమ్ము నాతోడఁ జనుదెమ్ము; దీనిఁ
జనుచుండునప్పుడు చదువుదుగాని.
అందకత్తియగునట్టి 'జెస్సికా' తోడఁ
ముందు కాగడ నాకు ముదముతోఁ బట్టు.

(అందఱును వెళ్ళిరి.)

౫. రంగము—వినీసునగరము; షైలాకు గృహము ముందర.

[షైలాకు, లాంసిలాటు ప్రవేశించుచున్నారు.]

షైలా— చాలవృద్ధుండగు 'షైలాకు' నకును
బాలుఁడైయున్నట్టి 'బస్సానియో' కుఁ
గలభేదమంతయుఁ గన్నులనిండఁ
దిలకింపఁగల వీవె తెల్లంబుగాను—
ఏమెహో 'జెస్సికా'! ఏమె యమ్మాయి!
నామందిరంబున నమలెదునట్లు
గా మితితప్పి యాకడ మ్రింగఁదగదు—
ఏమెహో 'జెస్సికా'! ఏమెయమ్మాయి—
ఊరికి గుఱకపెట్టి గుడ్డలనెల్ల
నూరక యిటఁ జింపుకోరాదు. నిపు—
ఏమె 'జెస్సిక'! పల్కు— వెంటపిల్చినను

లాంసి— ఏమమ్మ 'జెస్సికా'! ఇటకు

రావమ్మ.

షైలా—నినుఁబిల్వమనియేరునియమించి
వారు?
నిన్నుఁ బిల్వుమంచును నేఁ జెప్పలేదు;
లాంసి—ఎప్పుడును నాచేత నేపని గాని
చెప్పించుకోనిదె చేయ వీవంచు
మీ రనుచుండెడివారు కాఁబట్టి
యూరీతిఁ బిలిచితి నిప్పుడు నేను,
[జెస్సికా ప్రవేశించుచున్నది.]
జెస్సి—పిలిచినారేనన్ను? సెలవేమియిపుడు?
షైలా—పిలువంగఁబడితిని విందునకేను.
ఆవె నాదు తాళముచెవులు జాగ్రత్త—
(తనలో) అవు నేల యచటికే నరుగంగ
వలయు?
ప్రేమంబుచే నన్నుఁ బిల్వఁగా లేదు;
నామోముముందఱ నన్ను స్తుతింత్రు;
అయినను బగచేత నరిగెద నేను
వ్యయమత్యధికముగా నటు చేయునట్టి
వెడఁగు 'క్రైస్తవు' సొమ్ము వెచ్చపెట్టంగ
(ప్రకాశముగ)
పడఁతుకరో! యిల్లుభద్రమ్ముసుమ్మి—
(తనలో) ఏగ నాకింతయు నిష్టంబులేదు;
బోఁగుదు సొమ్ముసంచులఁ జూచినట్లు
చనినరే యేను దుస్స్వప్నంబుఁగంటిఁ
గనుక, నామది కేమొకలఁత రాఁగలదు.
లాంసి—తగదిట్టు; ప్రార్థింతుఁ దరలు
ము వేగ;
మిగుల నెదురుచూచు మీరాక కోరి
ఇగ బాలుఁడైన నాయేలిక యిపుడు.
షైలా—తగఁదిట్టు; నాకు నవగతంబె
సుమ్ము.

లాంసి—వారెంద టొకటిగాఁ జేరి యు
న్నారు?
బూఁగటెల్లను దొంగముఖములవారి
నీవు చూచెదవంచు నేఁజెప్పఁబోను.
నీవు చూచెదవేని; నిజముగా వల్ల
సోమవారమునాఁడు సూర్యోదయమున
నాముక్కు నెదురుట నన్ను మూరకరోం
పోలేదు; బూడిదబుధవాసరమున
వాలుగేఁడుల క్రింద నావత్సరంబు
వెలయఁగా మధ్యాహ్న వేళను వచ్చె.
షైలా—కలదుగా మాఱుమోముల వేడ్క
నేఁడు—
వినుమోసి 'జెస్సికా'! బీగము వేసి
మనతల్పు లెల్లను మఱి మూసియుంచు;
తుడుములరొదలును, మెడ మెలిద్రిప్పి
చెడుగుఁబిల్లనగ్రోవి పడినూఁదువారి
వెడకీఁచురొదలును, విన్నప్పుడీవు
వడి గవాక్షములెక్కి వలవదుసుమ్మీ;
పలురంగులాననంబుల నింపఁ దాల్చు
తెలివిమాలిన 'క్రైస్తవులఁ' జూచుటకు
వెలఁదుకరో! రాజవీథులయందుఁ
దలఁజూపఁబోకుమీ తలుపులు తెఱచి
మనయింటికర్ణంబులను మూసిపెట్టు.
మనగవాక్షములంచు మద్భావమమ్మ.
పనికిమాలినపిచ్చిపనులశబ్దంబు
మనసాధుమందిరంబునఁ జొరనీకు;—
(తనలో) 'జ్యాకబుచేకట్టి సాక్షిగారాత్రి
నాకుఁ గోరిక విందునకు నేగ లేదు;
ఏరీతి నున్న, నే నేగెద నేఁడు—
(లాంసితో.)

సాలా—కాముకు లిలఁ దామ కామించు
వారి
ప్రేమమునఁబడఁ గ్రొంగ విను మొట్టమొదటఁ
బదిరెట్లు త్వరతోడఁ బరువెత్తి వత్తు,
రది లభియించినపిదపను దానిఁ
జెడఁగొట్టుకొనకుండఁ జేరికాపాడ
వచ్చునెన్నడు నేగు నప్పటికంటె.
గ్రాషి—నీవు చెప్పినదెల్ల నిక్క మెన్నుము మిత్ర.
ఏవాఁడు విందునకేగి యచ్చోట
పాదినికూర్చున్నయంత యాఁకటను
మేదినిలో లేదు మెక్కిన వెనుక ?
హయరత్నమేయది యభినవంబుగను
బయలు దేఱినపుడు పరుగెత్తునంత
జవసత్త్వములతోడఁ జనుదెంచు మరల
మిగులఁ బరిశ్రాంతి మించినయపుడు ?
వసుధలో వస్తుసంపాదనమునకు
నొసఁగెడు శ్రద్ధలో నొకయింతయైన
మనుజులు పడసిన వెనుక నావాని
ననుభవించుటకియ్య రదియేమొకాని,
తరుణవయస్కుఁ డందంబున నొండెఁ
బోరిదుర్వ్యయము చేయు పురుషునట్లొండె
ధ్వజపటంబులు దాల్చి స్వసముద్రసీమ
నిజముగాఁ జనునౌక నెవ్వడి వెడలి
వగలజారిణిఁబోలు వాయువుచేతఁ
దగ పెట్టు లాగింతము చేయఁబడును
కడకు సర్వంబును గణికను బోలు
చెడుగాలిచేతనె చెడఁగొట్టుకొనుచుఁ
జెల్లి కాలముకడు శిథిలంబులైన
త్రొల్లిఁటియవయవ స్తోమంబుతోడఁ
జినిఁగిపోయిన చాపచేలములతోడఁ
వెనుపటి విచ్ఛిన్నతను బోలఁబొంది
ధరదుర్వ్యయము సేయు నరునిఁబోలి రాదే
మరల నెట్టులువచ్చి మనికిఁ జేరదుమా !
సాలా—వెనుక నీకథ చాల వినిపింపవచ్చు
చనుదెంచుచున్నాఁడు, సఖుఁడ ! 'లో
రెంజో.'

[లోరెంజో ప్రవేశించుచున్నాఁడు.]

లోరెం—ఏగి, నెచ్చెలులార ! యేనింత
సేపు
జాగొనర్చుటకును క్షమింపవలయు.
కని పెట్టుకొనియుండఁ గనిమ్ము నాదు
పనియె చేసెను గాని వినుఁడు నేను గాదు.
మీరు భార్యలకయి మిగుల వేచుకను
చోరవేషములకుఁ జొచ్చినయపుడు
మీనిమిత్తము గూడ నేనంత తడవు
మాఁటకని పెట్టి మఱియుండువాఁడ.
ఈదారిఁ జనుదెండి ; యిదిగో నా మామ
'యూదుండు' వసియించి యున్నమం
దిరము—
ఎవరున్నవారు హో ! యింటిలోపలను ?

[బాలుని వేషముతో జెస్సికా మేడమీద
ప్రవేశించుచున్నది.]

జెస్సి—ఎవరయ్యమీరు? మీ యెలుఁగును
నేను
గుఱుతుపట్టితిఁగాని, మఱియింత సరిగ
నెఱుఁగుటకై మీ రెఱిఁగింపుడయ్యా.
లోరెం—నీకూర్మి 'లోరెంజో' ; నీ
మనోహరుఁడు
జెస్సి—నాకూర్మి 'లోరెంజో' నా మనో
హరుఁడౌ

ఎవ్వనిమీఁద నాకింతటికంటె
నివ్వటిల్లును గూర్మి నిశ్చయంబుగను?
నీదాన నిపుడు నే నౌదునో కానో
యే దేవుఁడెఱుంగును నీవుదక్క నింక ?
లోరెం—దినము నీవు నాదాన వనుటకు నీదు
మనసును దేవుఁడుఁ జెప్పఁజాలు నిపుడు.
జెస్సి—ఇదె పట్టుకొనుఁడయ్య యీ
పెట్టెమీరు;
ఇదియిచ్చుఁ బ్రతిఫల మీ పడ్డశ్రమకు,
మీరు నన్నీక్షింపలేరు కాఁబట్టి
యే రాత్రియౌటకు నెలము చెందెదను.
ఏమందునియ్యెడ నెంతయు సిగ్గు
నామారువేషంబునకు నాకె పొడము.
కామంబు గ్రుడ్డిది; కాముకు లెందుఁ
దామొనరించెడి తమదోషములను
వారెఱుంగఁగఁజాలు వారేమ రేని,
యీరీతి బాలు నాకారంబు దాల్చి
నను జూచి మారుఁడైనను లజ్జపడును.
లోరెం—వనితరో! దిగిరమ్మ! వచ్చి
కాగడను
బట్టువాఁడవుగఁ గావలయును నాకు
జెస్సి—పట్టంగవలయుఁ గా వచ్చి కాగడను
నా సిగ్గు వెల్లడి చేసికొనంగ ?
నా సిగ్గె కాగడ నాసింపకుండ
వెల్లడియగుఁ జుమీ యెల్ల వారలకు.
వెల్లగ గాగడ వేసెడువాని
పని వెల్తురొసఁగుట, గనుకఁ జీఁకటిని
గనరాక డాగంగఁ జనెడు నే నేల?
లోరెం—డాగియున్నావు చూడఁగ,
సుందరాంగి!
బాగుగానందమా బాల వేషమున
రారమ్ము వేవేగ; రాత్రియుఁ గూడ
జారుచున్నది సన్న సన్నగ నిపుడు;
ఘనులు 'బస్సానియో' గమనోత్సవమున
గని పెట్టియుందురు మన నిమిత్తంబు.
జెస్సి—తలుపు లెల్లను వేసి ధనమింత
గొనుచుఁ
గలిసికొందును దిన్నఁగా వచ్చి మిమ్ము.
గ్రేషి—నాదు శాటికతోఁడు నలిబాకీ
తోఁడు
'యూదిని' గాఁగాక యోగ్యజాతిదిగ.
లోరెం—ఈమెను మనసారఁ బ్రేమింపకేని
క్షేమతహీనుఁడ నిజముగా నౌదు.
తలఁచి చూచెదఁగ నీకెవ్వఁగినాకఁ
దెలిసినంతవఱకు ధీమంతురాలు;
రూపసంపన్న నాచూపునఁ జూడ;
కాపురంబు సుగుణగణములకెల్ల.
కనుక నామదిలోనఁ గలకాలమామె
కనఁబడవలయును ఘనబుద్ధిమతిగ
వరరూపవతిగాఁగ బహుగుణాఢ్యగను.
[క్రిందినుండి జెస్సికా ప్రవేశించుచున్నది.]
(జెస్సి॥తో) అదెందితివె నీవు?
హస్త్రీంద్రయాన!
(మిత్రులతో) చనుదెండు పోదము సఖు
లార! మనము;
మనరాక నెదఁగోరి మాఱు వేషముల
వేసినమిత్రులు వేచియుండుదురు.
(జెస్సికా, లోరెంజో, శాలారినో
వెళ్ళుచున్నారు.)
ఆంటోనియో ప్రవేశించుచున్నాఁడు.

చీచీ! సత్తుఁబెట్టె యేమి చెప్పెడును ?
"ననుఁగోరుకొనువాఁడు తనకున్న దెల్లఁ
దనది కాదనుకొని తగనియ్యవలయును."
దేనికై సర్వంబుఁ దెగువ నీవలయు ?
హీనవాగమునకా యియ్యంగవలయు ?
శాసింపుచున్న దీపెట్టియమిగుల.
వదలి సర్వంబును బడినిద్చువారు
తగినలాభము పొందఁ దగునన్న యాస
దగిలి చేయుదురు దానిఁ బట్టిపనిని.
అరుగదు చిలుములోహంబు మీఁదికిని
బరఁగ బంగారంబువంటి మానసము.
కాన, నీసమకోటికి నేనాఁడు నేను
దేనిని నియ్యంగఁ దెగియింపఁగొందు.
పదిలమౌ తనస్వచ్ఛవర్ణంబుతోడ
నిది వెండిపెట్టియ యేమిచెప్పెడును ;
'ననుఁగోరుకొనువాఁడు నరులలోపలను
దన యర్హతకు నేదితగు దానిఁబడయు.'
తనయర్హతకుఁదగు దానినా పడయు ?
మనస ! విచారింపుమా క్షణమాగి
పక్షపాతములేక పాత్రతయెంత
దక్షతఁ గలదో యీధరణిపై నీకు ;
నీకైనయెన్నిక నే చూతువేని,
యాదెంతకైనను నర్హుండ వీవు
ఆయెంతకైనను నర్హుండ వనుట
యీయింతివలకును వ్యాపింపదేమొ
అయిన నేనర్హుఁడ నౌదునా యనుచు
భయపడుటెల్ల నాపయి లేనిపోని
పెనుకొంకుతనము దెచ్చి పెట్టుకొంటగును.
తనర నాకెయ్యది తగు, దానిసెకద !
నిస్సంశయముగ నాకీరజాననయె

లెస్సఁగా దగియుండు లీలమైనాకు
వరకులీనతచేత భాగ్యంబుచేత
సరససద్గుణరూపసంపదచేత
పెద్దలశిక్షను బెరుఁగుటచేత
తద్దయుఁ దగుదు నాతరుణికి నేను ;
అన్నిటికంటె ముఖ్యంబుగ నామె
కన్నంగఁ దగియుందు నేను ప్రేమమున.
ఇచ్చట నే యాగి యీ పెట్టెఁ గోర
కచ్చటికిని నేల యింకఁ నేగవలెను ?
అయిన నింకొకసారి యాసువర్ణంబు
పయినకెక్కినవ్రాఁత పరికింతు మిపుడు
"ననుఁగోరుకొనువాఁడు నరులు పెక్కండ్రు
మనసులోపలఁ గోరుకొనుదానిఁ బడయు,"
నరులు పల్వురుగోరునదియె యీయింతి ;
అరయ నీమెను లోకమంతయుఁ గోరు,
మనుజావతారంబు గనినయీదివ్య
వనితదేహము దేవళము సేవింపఁ
గాముకజనులు నల్గడలయందుండి
భూమిపై వత్తురు పూర్ణాశతోడ.
అలరారు 'హార్కానియా' దేశమందు
వెలయువిశాలంపు విజనభూములును
'యవన' దేశపు దుర్గమారణ్యములును
యింపతిఁ జూచెడువేడ్క నూరకవచ్చు
రాజకుమారులరాకను బట్టి
రాజమార్గములగెన్ను రమణీయములగను.
తనశిరమ్ము మహోన్నతంబుగ నెత్తి
ఘనగర్వమునను స్వర్గముఖంబునందు
నుమ్మివైచెడునట్టు లూర్మికాళిక
రమ్ములు లేవఁ బరఁగుసముద్రమందు

ఇతరదేశీయుల కేతెంచుటకును
ప్రతిబంధకముగాక పసచెడి యుండె ;
కావున జలధిని గాలువవలెనె
లావణ్యరాశి యీలలనదర్శింప
నవలీల దాఁటి వారరుదెంతు రిటకు.
ఇవె పెట్టియలుమూఁడు నిందులోఁగలదు
దేనిలోనో యీమెదివ్యపటంబు
పూనునే సీసంబు పూర్ణేందుముఖిని !
అపచారమగు హీనమౌ మృత్తికలఁపు
నిపు డింపుకొనియు నెదఁ దలంచినను ?
నల్లనై వసుధాధినాఁ జనుదీన
వెల్లనైగా నీమెప్రేతవస్త్రంబు
నైనను బెట్టుట యతిలాఘవంబు.
ఈ నాతి పుటమిడ్డహేమంబుకంటెఁ
బదిరెట్లువెల డింపదు వెండిలోనఁ
బొదుగంగఁబడియుండఁబోలునం చెంతు.
అట్టు తలంచుట హా ! పాపమగును !
ఇట్టి యమూల్యమైనట్టిరత్నంబు
హేమంబుకంటెను హీనమౌదాన
భూమిపై నెప్పుడుఁ బొదుగంగఁబడదు.
తిలకింప 'నింగ్లాండు' దేశంబునందుఁ
గల దొక్కదేవతాకన్యరూపంబు
బంగారునాణెంబుపయిఁ జెక్కఁబడును
బంగారువెలుపటఁ బడియుండునదియు.
కాని, యీదేవతాకన్య యిచ్చోటఁ
దానున్న దీహేమతల్పంబులోన—
ఇమ్ము బీగమ్ము నేనిదె కోరుకొందు,
నెమ్మదికోర్కెఫలము నాకొసఁగినగాని
పోక—అదిగో రాజకుమార ! యదె
పుచ్చుకొమ్ము.
పదిలముగా నాదుపటమందులోనఁ
గనఁబడ్డ, నీదానఁ గాఁగల నేను.

(అతఁడు బంగారుపెట్టె తాళము తీయుచున్నాఁడు.)

ఓరా—నరుఁ జైతిదిది వె ? హా! నాదు దైవంబ
ఏమి లభించిన దిక్కడ నాకు ?
భీమమృత్యువుయొక్క పీనుఁగు దొరకె
కట్టుగా వ్రాసినకాగిత మొకటి
చుట్టియున్నది దీనిశూన్య నేత్రమున,
అదిపుచ్చుకొనివిప్పి యందేమిగలదో
చదివెద నంతయు సరిగాను నేను.

(ఇట్లు చదువుచున్నాఁడు)

(తేటగీతములు)

"వహిని మెరసెడి దెల్ల హేమంబుగాదు
పలుమఱును జెప్ప నిదివిన్నవాఁడవౌదు ;
పలువురమ్మరి తమదుజీవముల నాదు
మీఁదిరూపంబుఁ గనుటకే మిథ్యగాధ ;
పుత్తడిసమాధులను లోనఁ బురుగులుండు!
ఎంతధైర్యవంతుండవో యంతనిండు
బుద్ధిమంతుఁడవయినను, బుడమిమెండు
కాయపాటవమును నీవు గలిగియుండు
చంచలునవై యాలోచన చాల నుండు
వాఁడవయినను, నీకిట్టిబదులొకండు
వ్రాయఁబడి యెంతమాత్రంబు రాకయుండు
పోయెమీకృపి ? యిఁక నాజ్ఞ పుచ్చుకొండు."
పోయె నిశ్చయముగఁ? బూనికయెల్ల
నాయది విఫలమై నడచె నీర్ష్యడను.
చిన్నమ్మగారు తాసెలవు సైకొనగ,

చెన్నడి వసుఁ జేరఁ జెద్దమ్మవారు—
సెలవిచ్చి యో 'పోర్షియ! చిరముగానిలిచి
సెలవుఁ గైకొన మదిచెదరి యున్నాఁడ.
ఇల యత్న వైఫల్య మెనయువారెల్ల
సెలవు నీరితి నే చేకొందురెపుడు.

[వాద్యములు మ్రోయుఁగా పరివారము
తో వెళ్లుచున్నాఁడు.]

పోర్షియ—(తనలో) చక్కఁగావదలెనీ
జనవల్లభుండు;
తక్కినయితని చందమువార లెల్ల
నీరీతినే వరియింతురుగాత!
(సేవకునితో) ఓసి! నీవా తెరనాగి
వేసిరమ్మ.

అందఱు నిష్క్రమించుచున్నారు.)

——

౮. రంగము—వినీసు పురము; ఒకవీథి

[శాలారినో, సోలానియో ప్రవేశించుచున్నారు.]

శాలా—:బస్సానియో యోడపైనెక్కి
పోవ
విస్పంకటయంబుగ నేఁజూచినాఁడ;
ప్రీతిమై 'గ్రేషియానో' తానుగూడ
నాతనితోడనె యరిగినవాఁడు.
వాఱలెక్కినయోడపయిని 'లోరెంజో'
యే రూఢిగా నిప్పుడేఁయుంగుడు లేఁడు.

సోలా—చెడుగు 'యూదుఁడు' రాజుఁ
జేరంగఁ బోయి
పాడిపాడి యేడ్పులఁ బుకిక్కొల్పుకతన,
నొకయందు 'బస్సానియో' యోడ నెవక.
[illegible] వానినిగూడ జెంబడిఁగొనుచు.

శాలా—అలస్యముగవార లరిగిరిగానఁ
గాలదూరముపోయె సాగియాయోడ.
కాని, విచారించి తప్పు వాదుఁడచటఁ
జూనల్ల లోరంజో తనమోహనాంగి
యగు 'జెస్సికా' తోడ నరిగె వేఱొక్క
తగునోడలోనని దక్షత నెఱిఁగె;
అదియునుగాక వారాయోడలోన
సదుపాయముగను 'బస్సానియో' తోడ
లేరుమాటిలిసంచు లిఖితరూపమునఁ
జేసి 'యాంటోనియో' చెప్పెరాజునకు.

సోలా—పఱచును వీధులఁబడి యక్క
కరణి
పఱచెడి 'యూదుని' యఱపులవంటి
వివిధంబులైనవి వింతలైనవి యెందు
నవకరంబైన నవ్యక్తమైనవియుఁ
బెనబొబ్బలెందును వినియుండలేదు.
పుడమిపై నింతకు మునుపు నే నెపుడు
'హాసుత! హాస్వామ్మ! హా నాకుమారి!
ఓసి! క్రైస్తవుతోడ నొకటఁ బోయితివె!
నాదు క్రైస్తవకాంచనంబ! ధనంబ!
ఏదిన్యాయంబు! మఱిఏది దండనము!
మాడలుకొంతురు! మఱియు దీనంబి!
మాడల సంచులు మంచివి రెండు!
చక్కనైనవరాలసంచు లారెండు
నక్కటకూఁతుచే హరియింపఁబడియె
నగలును మేలిరత్నంబులు రెండు!
జగజంపు వెలహెచ్చు జాతిరత్నముల
హరియించె నా రెంటి హా నాతనూజ!
సరిసరి! న్యాయంబు! సతి వెతకుండు;
మానికంబులు నాదు మాడలన్నియును

